# తెలుగునాడు

మహాకవి
దాసు శ్రీరాములు







శ్రీ

# తెలుఁగు నాడు

అను

## ఆంధ్రవీథిలో బ్రాహ్మణ ప్రశంస

అను

మొదటి భాగము

రచన:

మహాకవి దాసు శ్రీరాములు

ప్రచురణ:

మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి

హైదరాబాదు-20.

తెలుఁగునాడు

మహాకవి దాసు శ్రీరాములు

6 వ కూర్పు 1974

ముఖచిత్రము :

శ్రీ గోలి శివరాం

మూల్యము 2 రూ.



1-10-97, అశోక్‌నగర్-హైదరాబాదు 20.

ముద్రణ : శివాజీప్రెస్, సికింద్రాబాదు.

# తొలిపలుకు

మహాకవి దాసు శ్రీరాములు పంతులుగారు న్యాయవాది వృత్తి నవలంబించి నిరంతరలౌక్య కార్యమగ్నులై యుండియు నెట్లో తీరిక చేసికొని పెక్కు గద్య పద్య గ్రంథములు రచించి శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి ప్రముఖులైన కవి పండితుల ప్రశంసలందు కొని యుండిరి. వారి పద్యకావ్యములలో బృహత్తరమైనది దేవీ భాగవతాంధ్రానువాదము; చిన్నదయ్యు బహు ముద్రణములంది యధిక ప్రచారము గాంచినది తెలుఁగునాడు. వారు తెలుఁగునాడును 28–12–1892 నకు సరియగు నందననామ సంవత్సర పుష్యశునమీ కుజ వారమునాఁడు రచింప నారంభించి దాని యందలి ప్రథమ భాగమగు బ్రాహ్మణ ప్రశంసను మాత్రము ముగించి దివంగతులైరి. ఆ గ్రంథ మును వారు పూర్తిచేసి యుండినచో నది యపూర్వమై యాంధ్ర సారస్వతమున కమూల్యాలంకారమై యలరారి యుండెడిది.

పూర్వకవులలో శ్రీనాథకవి సార్వభౌముఁడు క్రీడాభిరామమను వీధి నాటకము నొక దానిని రచించినట్లెల్లరు నెఱింగిన విషయమే. అది వినుకొండ వల్లభరాయ రచితమని కొందఱి యభిప్రాయము. ఎవ్వరు రచించినను తెలుఁగు నందలి మొదటి నాటక మదియే. నాటక మన్న పేరే కాని యదియు శ్రవ్య పద్ధతినే రచింపఁ బడినది. ఇంచుక మార్పుతో దానిని దృశ్యముగా చేయవచ్చును. అది మంచనశర్మ టిట్టిభసెట్టి అను నిరువురు మిత్రుల సంభాషణము రూపమున సాగినది. అందా కాలమునాఁటి రాజకీయ సాంఘికాది విషయ వర్ణనముతో పాటు స్త్రీలవర్ణనమును అధికముగాఁ గలదు. శ్రీ శ్రీరాములు పంతులు

గారు దానిని జూచియే శాఁబోలు నసభ్యమగు శృంగారమును బరిహరించి యాంధ్రదేశమునందలి యన్ని జాతుల వారి వేషభాషా సంప్రదాయాదులను యథాతథముగా వర్ణింపవలెనను నుద్దేశముతో నీ గ్రంథమును రచింప నారంభించిరి. "కులవర్తనముల నానాకలనము లాచారముల ప్రకారము లందంబులఁ జందంబుల నుడుగుల పలు తెఱఁగులు నాదుఁ జెప్పఁబడుఁగడు వేడ్కన్" అని వారే యా గ్రంథము స్వరూపము వివరించి యుండిరి. ఏ కారణముచేతనో వారొక్క బ్రాహ్మణ ప్రశంసతోడనే గ్రంథమును విడిచివేసిరి. వారు దీని నాంధ్ర వీథియని పేర్కొన్నను దీనిని సంభాషణాత్మకముగాఁ గాక వర్ణనాత్మకముగనే సాగించిరి. ఇందు వీథీరూపక లక్షణము లేవియుఁ గానరావు.

తెలుఁగు నాట బ్రాహ్మణులలో ననేక శాఖలున్నవి. ఆయా శాఖలందలి స్త్రీపురుషులయు యువతీయువకులయు వేషభాషా వృత్తులందు వైలక్షణ్యము గోచరించును. శ్రీ శ్రీరాములు పంతులు గారు వానినన్నింటిని మిక్కిలి నిశితముగాఁ బరిశీలించి యీ గ్రంథమున సహజముగను సరసముగను వర్ణించి యుండిరి. "ఉన్నది యున్నయట్లు మధురోక్తులఁ జెప్పిన కబ్బ మెప్పుడున్ బన్నము నొందదందఱును బాగనిమెత్తు"రని వారి యభిప్రాయము. ఆ యభిప్రాయమున కనుగుణముగనే వారిందు పక్షపాతముకాని, అభిమానము కాని తోపకుండ బ్రాహ్మణశాఖలందుఁ దమకుఁ గన వచ్చిన విశేషములు మంచివైనను జెడ్డవైనను లెస్సగా వివరించి యుండిరి. "ఇది నవవీథి దీనికి ననేక రసంబు లనేక నాయకుల్ పదపడి మంచిచెడ్డలును బాగులునోగులు మేలుగీళ్ళునుం గొదవలు గొప్పలంధ్రజనకోటికి నెట్లగునట్లు చెప్పెద" నని వారు గ్రంథారంభమున వ్రాక్రుచ్చి యట్లే రచనచేసి యుండిరి. లోకమునందలి జనులందఱును భగవంతునిచే సృజింపఁబడిన వారే. ఆతని దృష్టిలో నందఱును సమానులే. కాని స్వభావజములైన కొన్ని

మంచి చెడ్డలు వారియందు గోచరించుట సహజము. కవిగారు వాని నీ గ్రంథమున రసవన్మనోహరముగా వర్ణించియున్నారు.

వైదికులు, నియోగులు, స్మార్తులు, మాధ్వులు, వైష్ణవులు, శైవులు, కరణకమ్మలు, ద్రావిడులు, గోల్కొండ వ్యాపారులు మున్నగు బ్రాహ్మణులందఱు నందు వర్ణింపఁబడి యున్నారు. చివరఁ గొన్ని పండుగలు, అత్తకోడండ్రు, వివాహములు, పొడుము మొద లగు విషయములనుగూడ సంగ్రహముగా స్పృశించియున్నారు. శ్రీ పంతులుగారి వర్ణన విధానము మిక్కిలి రమణీయమై యెడనెడ హాస్యచ్ఛాయలతోఁగూడి చదివిన కొలంది చదువవలెనను నుత్కంఠ రేకెత్తించుచున్నది. వారిచే హేళన చేయఁబడిన వారుకూడ నాయా పద్యములను జదివి దరహాస సుందరవదనులగుదురే కాని యీర్ష్యా ద్వేషకలుషితాంతరంగులుకారు. వేమన పద్యములలోనిట్టి సరసమైన హేళన కనిపించును. అది పతితల కాయాదోషములనెత్తి చూపి వానిని బరిహరించుకొనవలెనను నభిలాష రేకెత్తించి సంస్కరణమునకు దారి చూపును. శ్రీ పంతులుగారు శిష్టాచార సంపన్నులయ్యు నుచితము లైన సంస్కరణములకు విముఖులుకారు. బ్రాహ్మణులంతఃశాఖా వివాహములు చేసికొనవలెనని వారి యుద్దేశము. వారి లోక పరిశీలన మద్భుతమైనట్టిది. వైదికులు, లౌకికులు మున్నగువారి యందలి ప్రధాన లక్షణములను, మాటలాడు తెలుంగులను వారెంతో చక్కగా వివరించి యుండిరి. "ఆస్సేచూస్సివషే," "కమ్మని మాట యొక్కటి సుఖమ్ముగఁ జెప్పెద" "అచ్చమ్మా యిది యేమిటే" "మాతుగళిల్లె నమ్మ" మున్నగు పద్యము లిందుకుఁ దార్కాణములు. "మా కర్తె సరంచు లౌక్యుల గృహంబులఁ జొచ్చిన వైదికోత్తముల్ కుత్తుక నిండఁ బచ్చడియు గోరసమన్నము దిండ్రు నిచ్ఛలున్" అనియు "నియోగిలో కమ్మని వార్యకార్య ఘటకమ్మవుఁ గాని పరోపకార

శూన్యమ్మున స్వప్రయోజన పరాయణమున్ దలపోయనిద్ధరన్"
అనియు వారు మొగమోటమిలేకుండఁ దమకు సత్యమని తోఁచినది
చెప్పియున్నారు. ఇట్లే అన్ని శాఖలవారిని గూర్చియు వారు చెప్పిన
విషయములెల్ల నిష్పక్షపాతములును యథార్థములునై యొప్పారు
చున్నవి.

ఇందలి పద్యములెల్ల ధారాశుద్ధి శోభితములును, భావ గంభీ
రములును, నిర్దుష్ట పదప్రయోగ భాసురములునై హృద్యములుగా
నున్నవి. శ్రీ చెళ్ళపిళ్ళ వారి వంటి మహాకవులకే యందుఁ గొన్ని
ధారణా యోగ్యములై యుండెనని వాని సౌష్ఠవమునుగూర్చి
వేఱుగా చెప్పనేల. కొన్నిచోట్ల కవిగారుద్దేశ పూర్వకముగనే స్వతంత్ర
ప్రయోగములు కావించినారు. రెండు మూఁడుచోట్ల శబ్దాలంకార
సంఘటనమున్నది. మాధ్వులను వర్ణించునప్పుడు వ్రాసిన 'వీటీ మోది'
అను పద్యము సమాస భూయిష్ఠమై వారి ప్రౌఢతా ప్రీతిని జాటు
చున్నది. పెక్కు సీసములు శ్రీనాధుని సీసములను దలపించుచున్నవి.
వారి కుటుంబమునకుఁ జెందిన యువకులును పెద్దలును వారి గ్రంథ
ముల నన్నిటిని సేకరించి మరల ముద్రింపించి వాని నాంధ్రుల కందఁ
జేయుటకై చేయు ప్రయత్న మచిరకాలముననే సాఫల్యము నొందుఁ
గాక యని యాశించుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని
4-5-1974

# నివేదనము

క్రీ. శ. 19వ శతాబ్ది ఉత్తరార్ధమున తెలుఁగు దేశమున జీవించి, ఆంధ్రసాహిత్యమును తమ అమూల్యమైన రచనలచే నలంకరింపఁజేసిన మహాకవులలో శ్రీదాసు శ్రీరాములుగారొకరు. వారు న్యాయవాదవృత్తి చేపట్టినను ఆంధ్రభారతీ సమారాధనమును సంతతము తమ కవితావృత్తిగా సాగించిన మేటికవులు, గీర్వాణాంధ్రాంగ్ల భాషాకోవిదులు. శ్రీరామకవి కవితావ్యవసాయము శ్రీనాధ కవివలె పండ్రెండవ యేటనే ప్రారంభమైనది. శతకములు, ప్రబంధములు, పురాణములు, నాటకములు, శాస్త్రగ్రంథములు-ఇట్లెన్నో ప్రక్రియలలో వారు కావ్యరచనలు గావించియుండిరి. వారి శతకములలో సోమలింగశతకము, రఘునాధశతకము, సూర్యశతకము, చిలుకలకొలికి శతకము, ముద్దులగుమ్మ శతకము, సంస్కృత కామాక్షీ శతకము మొదలగునవి ప్రసిద్ధములు. కావ్యములలో-సాత్రజితీ విలాసము, కృష్ణార్జున సంగరము, పంచనృసింహ క్షేత్ర మాహాత్మ్యము, లక్ష్మణావిలాసము, మొ॥నవి యెన్నఁదగినవి. తెలుఁగులో వీధి ప్రక్రియకుఁజెందిన 'తెలుఁగునాడు' ప్రత్యేకముగా, పేర్కొనఁదగినది వీరినాటకములలో మంజరీమధుకరీయము, మనోలక్ష్మి విలాసము, కురంగగౌరీశంకరము ఆంధ్రీకృత శాకుంతలము, రత్నావళి, మహావీర చరితము, ముద్రారాక్షసము, ఉత్తరరామ చరితము మొదలగునవి ముఖ్యములైనవి. వీరి రచన లన్నియు నొకయెత్తు వీరి దేవీభాగవత పురాణ మొక్కటి యొకయెత్తు. ఆంధ్రమున వెలసిన దేవీ భాగవతములలో దీనికున్న ప్రాశస్త్యమనన్య సామాన్యము. వారికి మహాకవి గౌరవము కల్పించు గ్రంథరాజము దేవీభాగవతము.

మహాకవి దాసు శ్రీరాములుగారు ఆధునికాంధ్ర కవిత్వ యుగ కర్తలైన తిరుపతి వెంకటకవుల ప్రశస్తి నందినవారు. వారి దేవీ భాగవతము, తెలుఁగునాడు కృతులలోని పద్యము లిప్పటికిని పండితుల నాలుకలపై నాట్యమాడుచున్నవి. ఇంతటి ప్రజాదరణ పొందిన శ్రీరామ కవీంద్రుల కృతు లిప్పుడు పాఠకలోకమున కందుబాటులో లేవు. వానిని పునర్ముద్రించి ప్రజలకందింప వలసిన యవసర మెంతైన కలదు.

ఈ యవసరమును దృష్టియందుంచుకొని, దాసు వంశమునందు జన్మించి ఆ మహాకవి యశస్సును వారసత్వముగా ననుభవించుచున్న మేమందరము కలిసి మహాకవి శ్రీదాసు శ్రీరాములు స్మారక సమితి హైదరాబాదులో 1978 వ సం॥ డిసెంబరు నెలలో స్థాపించితిమి. ఆ మహాకవి గ్రంథములను ప్రచురించుట ద్వారా వారి సాహిత్యమును నేటి తరమున కందుబాటులో నుండునట్లు చేయుట, వారి పేరు చిర స్థాయిగా నుండునట్టి ప్రజాహితోపకారములైన కొన్ని ప్రణాళికలను చేపట్టుట—అనెడి లక్ష్యములతో ఈ సమితి కృషి నారంభించినది.

మహాకవి దాసు శ్రీరాములు రచించిన తెలుఁగునాడు తెలుగు నాట అబాల గోపాలము నలరించిన పద్యగ్రంథము. క్రొత్తపద్ధతిలో నడచిన వీధి. తెలుగువారి నాటి యాచార వ్యవహారములను దెలియుట కుపకరించు కవితా కరదీపిక. అందువలన దాని నీ ప్రచురణ కార్యక్రమములో మొదటి గ్రంథముగా వెలువరించుట జరిగినది. ఆ తరువాత దేవీభాగవతమును ముద్రింప వలెనని ప్రయత్నములు జరుగుచున్నవి. క్రమముగా వారి ముద్రితాముద్రిత గ్రంథముల నన్నింటిని ప్రచురించి ప్రజల కందించుట ఈ సమితి మొదటి ధ్యేయము.

ఈ సమితి కార్యకలాపములను తీర్చిదిద్దుటలో మాకు మార్గ దర్శకులైన పెద్దలు శ్రీదేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివా

కర్ల వేంకటవధాని, కళాప్రపూర్ణ ఆచార్య నిడదవోలు వేంకటరావు, డా॥ పాటిబండ మాధవశర్మ, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, శ్రీదిగవల్లి వేంకట శివరావుగార్లకు, మాసభాకార్యక్రమాలకు చేదోడువాదోడుగా నిలుచుచున్న శ్రీకృష్ణ దేవరాయ ఆంధ్రభాషానిలయ కార్యనిర్వాహక వర్గము వారికి మా కృతజ్ఞతలు. శ్రీరామకవి ప్రచురణ కార్యక్రమమునకు ఆర్థికముగా సహాయపడిన వదాన్యులకు మా హార్థిక కృతజ్ఞతాభివందనములు.

శ్రీదాసు శ్రీరామకవిని గూర్చిన విశేషాంశములుగాని, వారి లిఖిత ప్రతులుగాని, పాతప్రచురణలుగాని ఎవరైన సేకరించి యున్నచో వానిని ఈ సమితికి అందజేసి ఆ మహాకవి సాహిత్యప్రచురణ కార్యక్రమమును దిగ్విజయము చేయ ప్రార్థించుచున్నాము.

'తెలుఁగునాడు' నకు పీఠికను దయతో వ్రాసియిచ్చిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికిని, కవిపరిచయమును రచించి యిచ్చిన కళాప్రపూర్ణ ఆచార్య నిడదవోలు వేంకట్రావుగారికి, ఈ గ్రంథమును సకాలములో ముచ్చటగా ముద్రించి యిచ్చిన శివాజీప్రెస్ వారికి మా కృతజ్ఞతాభి వందనములు.

మేము తలపెట్టిన ఈ ప్రచురణ కార్యక్రమమున ఆర్థికముగాను హార్దికముగాను సహకరించి ప్రోత్సహింపవలసినదిగా సహృదయ లోకమును ప్రార్థించుచున్నాము.

దాసు పద్మనాభరావు
అధ్యక్షుడు
మహాకవి దాసు శ్రీరాములు
స్మారక సమితి.

హైదరాబాదు.
8-5-1974.

# కవి పరిచయము

—కళాప్రపూర్ణ నిడదవోలు వేంకటరావు.

అద్యతనాంధ్ర సాహిత్య జగత్తులో ప్రసిద్ధులైన కొందఱు కవి పండితుల శతాబ్ది జయంత్యుత్సవములు జరిగినవి. కాని కడచిన శతాబ్దిలో ఘన యశస్సు గాంచిన కొక్కొండ వేంకటరత్నం పంతులు, మండపాక పార్వతీశ్వరశాస్త్రి, గోపీనాథం వేంకటకవి, వసురాయకవి (వడ్డాది సుబ్బారాయడు) మున్నగు వాని శతాబ్ద జయంతులు జరుగనే లేదు. ఆ మహాకవి పండితుల కోవలోనివారే— దాసు శ్రీరామ కవీంద్రులు—

ఆధునిక వాఙ్మయ చరిత్రలో శ్రీరాములుగారి కింకొక విశిష్టత గలదు లౌకికవృత్తిచే న్యాయవాదులయ్యు సాహిత్య ప్రపంచమున స్థిరకీర్తి నార్జించిన వారాకాలమున గలరు— ఆంధ్రనాటక పితామహ ధర్మవరము రామకృష్ణమాచార్యులు- ప్రథమ చారిత్రక నాటకకర్త కోలాచలము శ్రీనివాసరావుగార్లు న్యాయవాదులే. న్యాయవాది పట్టము బడసి ప్రభుత్వోన్నతోద్యోగులైన— భాషా ప్రపంచమునకు సమానమగు సేవ గావించిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారును స్మరణీయులు. ఈ దృష్టితోఁ జూచిన శ్రీరాములుగారికి నవ్యయుగమున నున్నత స్థానము గలదు.

సంస్కృతాంధ్ర భాషలలో కవిపండితులగుటయేగాక, శాస్త్ర విద్వాంసులగుటయు, శ్రీరాములుగారి యింకొక విశిష్టత— వారి సమకాలికులలో కొక్కొండ వారి తరువాత, కవిపండితులలో శాస్త్ర

విద్వత్తుగలవారు శ్రీరాములుగారొక్కరే- వారికి ధర్మశాస్త్రము, భరతశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము మొదలగు శాస్త్రములందు మంచి ప్రావీణ్యము గలదు.

1901 వ సంవత్సరమున (ప్లవ) నధికమాస నిర్ణయమునుగూర్చి తెలుగుదేశమున పెద్ద వివాదము చలరేగినది. ప్రఖ్యాత పంచాంగ కర్తలైన పిడపర్తివారు అధికమాసము వచ్చునని వాదింపగా, రాణి మహాగ్ని చిన్న నరసింహ విద్వాంసులు (వీరే రాణీచయనులుగారని పేరుపొందినవారు) రాదని వాదించిరి. విజయవాడలో జరిగిన యీ నిర్ణయ సభకు, ఆంధ్రదేశమున జ్యోతిష్కులందరునూ వచ్చిరి. ఆ మహా సభకు శ్రీరాములుగారే అధ్యక్షులై, అధికమాసము వచ్చునని తీర్పు చెప్పిరి. సభవారు వారి జ్యోతిశ్శాస్త్ర పాండిత్యమున కాశ్చర్య చకితులైరి.

సమకాలిక సాహిత్య ప్రక్రియల యందన్నింటనూ శ్రీరాములు గారు సిద్ధహస్తులు.

*1. పురాణ ప్రక్రియ :* వీరిక ముందు ములుగు పాపయారాధ్యులవారును, త్రిపురాన తమ్మయ్యదొరగారును దేవీభాగవతమును రచించిరి. కాని దాసువారి ఆంధ్రీకరణము తోడనే దానికి వ్యాప్తి కలిగినది. శ్రీరాములుగారి కృతి తరువాతనే పురాణ రచన తిరిగి ప్రారంభమైనది. జనమంచి శేషాద్రిశర్మగారు బ్రహ్మాండ పురాణము, ములుగు చంద్రమౌళిశాస్త్రిగారి లింగ కూర్మ పురాణములు వెలసినవి.

*2. శతక ప్రక్రియ :* ఈ ప్రక్రియలో వీరితరులకన్న నాలుగు విధములుగా ప్రత్యేకత చూపిరి.

1. సంస్కృత భాషలోనే శతకము రచించుట- కామాక్షీ శతకము.

2. సంస్కృత శతకానువాదము చేయుట-సూర్య శతకము: సంస్కృతమున మయూర మహాకవి రచించిన సూర్యశతకము మహా ప్రౌఢకృతి. శ్రీనాధుడు కొన్ని శ్లోకములకు పద్యములు రచించినాడు. కాని శ్రీరాములుగారు పూర్తిగా దీనిననువదించినారు. ఇది విశేష ముగా నభినందింపదగినది. దీని ముద్రిత ప్రతి గౌతమీ గ్రంథాలయము (రాజమండ్రి) న గలదు.

3. తెలుగు శతక రచనము: సోమలింగ శతకము, చిలుకల కొలికి శతకము. ముద్దులగుమ్మ శతకము.

4. అచ్చ తెలుగు శతక రచన: చక్కట్ల దండ-

వీరి దేవీభాగవతమున రెండు శతకములు సందర్భాను సారముగ గలవు.

*3. నాటక ప్రక్రియ:* ఇందునూ త్రివిధములుగా వీరు ప్రత్యే కతను ప్రదర్శించిరి.

1. అనువాదములు: శ్రీరాములుగారి సమకాలికముగా సంస్కృత నాటకానువాదములు చేయుట పరిపాటి యైనది. వీరు, రామ భద్ర దీక్షితుని జానకీ పరిణయమునూ, భవభూతి మాలతీ మాధవము, మహావీర చరిత్రలనూ ఆంధ్రీకరించిరి. వీనిలో మాలతీ మాధవము "సరస్వతి" అను పత్రికలోను, మహావీర చరిత్ర "మంజువాణి" అను పత్రికలోనూ ప్రకటితములైనవి. ఇంకనూ ముద్రారాక్షస, మృచ్ఛ కటిక, రత్నావళి మంజరీ మధుకరీయము మున్నగువానిని తెలిగించి నట్లు తెలియుచున్నది.

2. స్వతంత్ర నాటక రచనము: మహాలక్ష్మి విలాసము సీతా కళ్యాణము.

3. అచ్చతెనుగు రచన: శాకుంతల నాటకాంధ్రీ కరణము

ఆచ్చ తెనుగున నాటకము రచించినవారు శ్రీరాములుగారు తక్క వేఱెవ్వరు లేరు[1]

*4. ఖండ కావ్య ప్రక్రియ :* అధునాతన ఖండ కావ్య ప్రక్రియకు నొకవిధముగా ఆద్యులువీరే.

వీరి 'తెలుగునాడు' అను ఆంధ్రవీధి స్వతంత్రమగు సాంఘిక కావ్యము. 14వ శతాబ్దిని క్రీడాభిరామము వెనుక వెలసిన సాంఘిక వ్యవస్థను నిరూపించు కృతియిదే. క్రీడాభిరామములో చరిత్ర, సాంఘిక ప్రవృత్తులు రెండూ కలసియున్నవి. తెనుగునాడులో నితివృత్తము కేవలము సాంఘికము - దానువారి కృతులలో హెచ్చు ప్రచారము బడసినది తెనుగునాడే.

ఈ నవయుగములో సాంఘికేతివృత్త రచనకిదియే మొదలు దీని తరువాత ప్రసిద్ధమైనది భోగరాజు నారాయణమూర్తిగారి పండుగ కట్నము.

*5. వచన ప్రక్రియ :* ఆ కాలమున గ్రాంధికవచన రచన చేయుట వ్యాప్తిలో నుండెను. శ్రీరాములుగారి "అభినవ గద్య ప్రబంధము" చిన్నయసూరి గ్రాంధికశైలిలో రచితమైనది.

*6. శాస్త్ర గ్రంథములు :* తెలుగులో శాస్త్ర గ్రంథరచన శ్రీరాములుగారి కాలమున ప్రారంభదశలో నుండెను. వారు తమ అభినవ కౌముది, తర్క కౌముది, వైశ్యధర్మ ప్రదీపిక, సారసీల గ్రహ గణితము (గణితశాస్త్రము), అభినయ దర్పణము (నాట్య శాస్త్రము) మున్నగు రచనలచే నీ గ్రంథరచనకు నెంతో దోహదము గావించిరి

---

1. చూడుడు - ఆంధ్రనాటక వికాసము - డాక్టరు పి. యస్. ఆర్. అప్పారావుగారు.

*7. పద కవిత్వము :* శ్రీరాములుగారు పద్యకవిత్వ మందెంత ప్రవీణులో, పదకవిత్వ రచనము నందంత దిట్టలు. వీరు పదములనేగాక జావళీలను విశేషముగ రచించినారు. వీరు సంగీతనాట్య నాటక శాఖలకు చేసిన సేవగుర్తించి సంగీతనాటక అకాడమీవారు నాట్యకళలో వీరిని గూర్చి వ్రాసినారు.

ఇట్లు సప్తవిధ సాహిత్య ప్రక్రియలను సాధించుటయేగాక, వారు కవితా రచనయందు స్వతంత్రత వహించిరి. ప్రాచీన కవుల పోకడలను జీర్ణించుకుని, లక్ష్యలక్షణ వివేచనతో కవితారచన సాగించుట వీరి కావ్యములో ముఖ్య లక్షణము. 1. రేఫ అకారముల ప్రాసలో నుపయోగింపకూడదు 2. పూర్వకవి కృతపద జాలమునే వాడవలెను. 3. పూర్వకవి భావముల ననుసరింపవలెను అన్న లాక్షణిక నియమముల నన్నింటిని వీరు చర్చించి స్వతంత్రము, సజీవము - జాతీయమునైన రచనా రీతిని తమ గ్రంథములలో సుప్రతిష్ఠితము చేసినారు. పై విషయములు వారు దేవీ భాగవత పీఠికలో చర్చించినారు.

వారికాలమున శబ్దరత్నాకరము కవులకు ప్రధానగ్రంథముగా నుండెడిది. వసురాయకవిగారి ప్రక్కనెప్పుడును శబ్దరత్నాకర ముండెడిది. కవి పండితులలో, అందలి పదములనేతప్ప వాడకూడదని అభిప్రాయము బలీయమై యుండెడిది. శ్రీరాములుగారు స్వతంత్రించి ఇస్త్రీ, రుమాలు, లింగకాయ మున్నగు వ్యావహారిక పదములను ప్రయోగించి వానికి గ్రాంధికతావస్థ చేకూర్చినారు[1].

కవియే భాషాను శాసకుఁడు

కవిప్రయోగ మూలము వ్యాకరణము

అని వీరి సిద్ధాంతము.

---

1. వీనిని నేను శబ్ద రత్నాకరము - అనుబంధమున చూపినాను.

ఆద్యతన కాలమున స్వాభావిక వర్ణనలకు వీరిది పెట్టినపేరు. దేవీ భాగవతమునందు "అల్లూరి పల్లెటూరి వర్ణన" ఆంధ్రకావ్య వర్ణనలలో నను కరణీయమైనది ఆ వర్ణన ననుసరించి నేను పల్లెవర్ణన గావించితిని[1].

వీరు స్వతంత్రులు, మహాకవులు గావున వీరి గ్రంథములను సావధానముగా నధ్యయనము చేసిన మనకు నేడు, నిఘంటువుల కెక్కని పదములు, పలుకుబళ్ళు, కవితా సంప్రదాయములు నవేలముగా లభింపగలవు.

## ప్రాచీన భావ సమన్వయము

సాహిత్యమున కొక్కొండ వారివలెనే - శ్రీరాములుగారు సంఘమున ప్రాచీన సంప్రదాయములను, నవ్యసంస్కారముతో సమన్వయము చేసినవారు. పాశ్చాత్యనాగరికతా సంస్కార విశేషములను గ్రహించి వానిని, మన ప్రాచ్యసంప్రదాయ సారముగా సమన్వయించి దేశ పురోభివృద్ధికి తోడ్పడినారు.

ఆధునిక సాహిత్య యుగ ప్రక్రియలన్నింటియందు, బహుముఖ ప్రజ్ఞతో తమ ప్రత్యేక గరిష్ఠ స్థానమును ప్రతిష్ఠించినవారు శ్రీరాములుగారే.

చెళ్ళపిళ్ళ వారన్నట్లు, శ్రీరాములుగారు-సరసకవి, విద్వత్కవి, స్వతంత్రకవి, ఆశుకవి, దాత, నేత-

## రచనలు

వారు 83 గ్రంథములు రచించినట్లు దేవీ భాగవతావతారికలో చెప్పుకొన్నారు. ఆ గ్రంథములు ముద్రితములైనను, నేడు లభ్యమగుట లేదు.

---

1. చూ. మించుపల్లి.

దిగవల్లి వేంకటశివరావుగారు చెప్పినట్లు వారిజీవితము. ఉదార భావములు- వారి సంతతి వారికేగాక - ఆంధ్రులందరికి మేలుబంతులు

**సూచనలు**

1. శ్రీరాములుగారి జీవితచరిత్రను వారి కుమారులు విష్ణు రావుగారు 700 అరటావు పుటలలో వ్రాసినారు. అది ముద్రితమగుట అత్యావశ్యకము. ఈనాడు మనకు నవ్యయుగ సాహిత్యచరిత్ర లేదు- అట్టిగ్రంథములు బయలు వెడలిన- పై చరిత్రకెంతో ఉపయోగము.

2. వారి గ్రంథములన్నింటిని సేకరించి, ఒక కేంద్రమున హైదారాబాదు నందుంచుట. అప్పుడు ప్రత్యేకముగా సాహిత్యో పాసకులు కొందఱు వారిగ్రంథములామూలాగ్రముగా చదివి సమీక్షలు ప్రకటించి, వారిప్రతిభ లోకమునకు వెల్లడించుట కవకాశము కలుగును.

3. విశ్వవిద్యాలయములలో పరిశోధన : ఈ నాడు విశ్వవిద్యా లయములలో నవీన యుగమున మహాకవులను గూర్చి పరిశోధన జరిపి సిద్ధాంత వ్యాసములను (Thesis) రచించి, పట్టములు (Ph. D.) పొందుచున్నారు.

దాసు శ్రీరామ మహాకవి-ఆయన రచనలు అను విషయముపై విశ్వవిద్యాలయములలో పరిశోధన చేయించెదరని భావించుచున్నాను. శ్రీరాములుగారి వలెనే కొక్కొండ, మండపాక, గోపీనాధ వారలను గూర్చి విశ్వవిద్యాలయములలో పరిశోధన జరుగవలెను.

ఆరువేల పద్యసంఖ్యను పైబడిన దేవీభాగవతము నాలుగునెలలో, తనవృత్తి ధర్మమును నిర్వహించుచు, సంపూర్ణము చేసిన శ్రీరాములు గారి ప్రతిభ అనితర సాధారణము[1].

---

1. నియోగి సర్వస్వము 75,76

వారు వ్రాయునపుడు దాతు కలము నుపయోగించెడి వారని-ఆంధ్రపత్రిక 1916 సంవత్సరాది సంచికలో వారి ఛాయచిత్రమునఁ కలదు. అందు వారు లౌక్యవృత్తి వేషముతోఁగాక - గృహస్థు వేషముతో నున్నారు. వారి కుమార్తె, కవయిత్రి శారదాంబగారు కూడ అందుఁ గలరు. ఇట్టి ఛాయచిత్రములను సేకరించవలెను.

ఆంధ్ర మహాజనులు, శ్రీరాములుగారి గ్రంథములు పునర్ముద్రించుటకేగాక, పై సూచనలను ఆచరణలో పెట్టి అవి పూర్తి యగుటకు తోడ్పడుదురుగాక అని విన్నవించుచున్నాను

---

# పీఠిక

ఆ యీ తెలుఁగునాడు నేఁటికి సుమారు 60 యేండ్ల నాఁడు కీర్తిశేషులు శ్రీ దాసు శ్రీరామ మహాకవిగారు విరచించిరి. వా రిద్దానిని రచించు నాఁటికి మేము (తి॥ వెం॥) శ్రీ చర్ల బ్రాహ్మయ్య శాస్త్రిలవారి సన్నిధిని (కడియెద్ద గ్రామములో) వ్యాకరణశాస్త్ర మభ్యసించుచున్నారము. కవిగారి నివాసమైన యేలూరికి మేము అనధ్యాయపురోజులలో వెళ్ళు చుండువారము. వెళ్ళినప్పుడు శ్రీకవిగారికి నతిధులముగా నుండువారము. ఆకారణముచే దీనిని రచించుసమయమునకు కాకతాళీయముగా మే మచ్చటనే యుండుట తటస్థించినది. తీవ్రమైన బుద్ధిబలము కలిగి యున్న వయస్సులో నుంటచే దీనిలోని పద్యములు చాలవఱకు. నాకుఁ గంఠపాఠమైనవి, కొన్ని పద్యములు.

(1) తాతలనాఁడి నేలువులు (2) నమ్మిన నమ్మకున్న నది నావశమా? (3) విడువకురా ఉతోతఇషవేనమరా? అది దుడ్డు రాముణాఃకొడుక, (4) లేవరు లెండులెం డనిన, (5) ఆన్నే చూస్సివషే, (6) మెలివెట్టి నిలిపినమీసాలపై

లోనైనవి నా కిప్పటికిని సంధ్యావందన ప్రాయముగా వాచోవిధేయములుగా నున్నవి. కనుకనే తొలిముద్రణములో నుండి యిటీవల నే కారణముచేతనో లోపించిన.—

శా॥ "సర్వజ్ఞత్వము సాంబమూర్తిది మనుష్యప్రజ్ఞ యల్పంబు దు
ర్గర్వంబుల్ కొఱగావు దూషణల మోక్షశ్రీలు చేకూర వీ
యుర్విన్ ఖానికుఁ డెన్నిరాళ్ళు వడపోయుఁ గారత్న మొక్కంటికై
గుర్వర్థం బొకఁ డున్న జాలదె? సుధీకుంభుల్ విచారించినన్."

అనుపద్యము నీ ముద్రణమున, జేర్పఁగల్గితిని. నా యీ జ్ఞాపకమునకు గ్రంథకర్తగారి మనుమఁడు పద్మనాభరావుగారు కూడఁ దోడ్పడినందులకు సంతసించుచు నాయలఘు నాశీర్వదించుచు దీనిని ముగించుచున్నాఁడను

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శతావధాని

# పీఠిక

శ్రీనాధుని 'వీధినాటకము' ననుసరించి కొంతవరకు వ్రాయబడినప్పటికి దానికిని నా పుస్తకమునకును అనేక విషయములలో భేదమున్నటులఁ జదువరుల కందరకు విశదము కాఁగలదు. శ్రీనాధుని వీధిలో నాంధ్ర స్త్రీవర్ణనము మాత్ర మతి శృంగారముగా వర్ణింపబడియె. ఈ నాపుస్తకములో శ్రీనాధునిలో నున్న యాయతిశృంగారము గానరానీక తెనుఁగు దేశపువారల ప్రకారములు మాత్రము కొంచెము చమత్కృతితో స్వాభావికముగా వర్ణించితి. ఈయది తెనుగు దేశములలోఁ గల ముఖ్య వర్ణములవారిని వర్ణింప నుద్యమించిన నా 'తెలుఁగునాడ'ను మహావీధిలో 'బ్రాహ్మణ ప్రశంస' యను ప్రథమభాగము. ఇందు ఆంధ్ర బ్రాహ్మణులలోని పలు తెలుఁగులవారి కులవర్తనములు, ఆచార వ్యవహారములు, వేష భాషలు మున్నగునవి వ్రాయఁబడియుండె. ఇందొక తెగను గుఱించి వ్రాసిన వర్ణనలు మఱొక తెగవారికి సంబంధించు ననియు నియ్యది నిష్పక్షపాత బుద్ధితో వ్రాయబడియుండలే దనియుఁ గొంద ఱందురేమో. కవిత్వపు పస చెడకుండ సాధ్యమైనంత నిష్పక్షపాతబుద్ధితో నా శక్తికొలఁది వర్ణించియుంటినేగాని వేరొండు గాదని చెప్ప గలను. ఇదియునుఁగాక మనదేశములో బ్రాహ్మణజాతిలోఁగల వివిధశాఖలవారు అనవసరముగాఁ గల్పించుకొను వివాదలు తగ్గింపవలెనని నా యుద్దేశము. బ్రాహ్మణశాఖలలో వివాహ

సంబంధము లుండుట శ్రేయోదాయకమని నా యభిప్రాయము. ఈ యభిప్రాయమును ఈ పుస్తకమందేగాక యింతకుముందు నాచే రచింపఁబడిన యితర గ్రంథములలోఁగూడ వెల్లడిచేసితిని.

ఈ పుస్తకపు తుదిభాగము నే గ్రామాంతరమున నుండు నవసరమున ముద్రింపఁబడిన దగుటచే నచ్చటచ్చట గొన్ని ముద్రాస్థాలిత్యములు దోపవచ్చును. అట్టివానిని రెండవ కూర్పున సరిచేసికొందును.

సంఘవిషయములఁగూర్చి అబాధకములగు చమత్కార కావ్యములు మనదేశభాషలలో లేవు. ఐరోపాఖండమువారి ప్రస్తుత నాగరిక ప్రవర్తనమునకు కారణభూతములైనవి యిట్టి కావ్యములేయని నేను జెప్పనవసరములేదు కనుక చదువరులారా! యీ పుస్తకమున నుండు విశేషములను, వర్ణనలను గురించి మనసున వేరుగాఁ దలంపక నాయుద్దేశము నాలోచించి మన్నించి చదివి తక్కిన భాగములుకూడ త్వరలో వెలువడునటుల నన్ను ప్రోత్సాహపఱచెద రని నమ్ముచున్నాను.

ఏలూరు,
15—7—1899.

దాసు శ్రీరాములు

# PREFACE

Though written somewhat after the fashion of *Sri Nadha's Veedhi* this book has deviated from it in many points as the reader will see. My book, unlike *Srinadha's*, is not confined to a description of the peculiarities of Telugu Women and it is moreover free from the morbid taste which is met with in the pages of *Srinadha's* book. This pamphlet termed the "*Brahmana Prasamsa*" treats of the Brahmins and forms the opening chapter to my intended work *viz.* a description of all the principal castes of the Telugu people. It might be said by some that I am not altogether impartial and that the remarks applied to one sect may, with equal truth and force, be applied to another. To this I can only say that I am as impartial as I can be and that poetic fancy can not be altogether judged by any hard and fast rule. I may also say that among others it is my object in writing this to smooth down the many and unpleasant differences between sect and sect and in fact in this, as well as in some of my previous books, I have ventured to preach my pet exhortation-Inter-marriages among sub-sects of Brahmins and their advantages.

In the later portion of the book which has been printed during my absence in a distant place

one may find wrong punctuation here and there and I beg to say that such will be carefully corrected in the second edition.

In conclusion I beg to point out that there is a great need in Vernacular Literature of books containing witty and painless observations on social matters; it is such literature that has done so much in moulding the present polised manners of European countries . I therefore beseech my readers, to take the remarks contained herein in the spirit in which they are offered and to encourage me to bring out the other parts of the work.

ELLORE,
15-7-1899.

**DASU SRIRAMULU**

శ్రీరస్తు

# తెలుఁగునాడు

(స్తుత్యాదికము)

శ్రీపరమున్ మహేశుని భ
జించి రసంబు ఘటింపఁ గాశహ
స్త్రీపురమున్ బురాణ పురి
శ్రీగిరి యెల్లలుగాఁ దలిర్చు నా
నాపుర మానితం బయిన
నాఁటఁ జెలంగు దెలుంగుఁబల్లెలన్
గాపుర ముండువారల ప్ర
కారము వీధి యొనర్తుఁ గ్రొత్తగన్.

ఉ. లోకవితాన మేలు పరలోకవిభుం డఖిలంబు గూర్చెనా
నా కవితాకునన్ ధనమునం బరితృప్తులు గాక నిక్కువా
రా కవితారసంబు లెనయంగల రద్దమరేయి దొంగకున్
రా కవితంబ యయ్యవి నిరాకుల చిత్తులపాలి భాగ్యముల్.

చ తెలుఁగునఁ దేటతెల్లముగఁ దెల్పినమాట వరాలమూటగాఁ
దెలుఁగున మాటలాడు మనదేశపువారు గణింతు రందుకై
తెలుఁగనునాఁటివారల నుతింప నతిశ్రమ మంచు నెంచకే
తెలుఁగున వీధి సేయఁదగదే ధని మెచ్చిన మెచ్చుగల్గునే.

కం. కులవర్తనముల నానా
కలనము లాచారముల ప్రకారము లందం
బులఁ జందంబుల నుడుఁగుల
పలుతెఱుఁగులు నిందుఁ జెప్పఁబడుఁ గడువేడ్కన్.

చ. ఇది నవవీధి దీనికి ననేకరసంబు లనేకనాయకుల్
పదపడి మంచిచెడ్డలును బాగులు నోగులు మేళ్ళుఁగీళ్ళునుం
గొదవలు గొప్ప లంధ్రజనకోటికి నెట్లగు నట్లు సెప్పెదన్
మదిఁబరికించి కోపమును మానుఁడునానుడుఁగానుఁడూరకన్.

ఉ. ఉన్నది యున్నయట్లు మధురోక్తులఁ జెప్పిన కబ్బ మెప్పుడున్
బన్నమునొంద దందఱును బాగని మెత్తురు, లేనిపోని దం
ధన్నలు కొన్నిపన్నుక కతల్ వెదఁబెట్టిన నేమి, యన్నెమా?
పున్నెమ? పూరుషార్థమ? బుభుక్షువు సేసిన బ్రాహ్మణార్థమా?

సీ. భాషీయపద్ధతి పట్టుదప్పఁగ నీక
దీర్ఘసమాసంబు తెరువుపోక
గూఢార్థసమితి దిక్కును దేఱిచూడక
స్పష్టార్థములజాడ జాఱనీక
మఱుఁగు పదంబుల మార్గంబు ద్రొక్కక
తేటమాటల రాచబాట విడక
దూరాన్వయంబుల దారి మూచూడక
సంకరాలంకార సరణి గనక

గీ. ఉన్నయది ఉన్నయట్టులు గన్నయదియుఁ
గన్నయట్టులు విన్నది విన్నయటులు
నన్నయది యన్నయట్టులు వన్నె వెట్టి
కవితఁ జెప్పిన సంతోష మవు జగాన.

సీ. ఉచ్చరించినమాట యూఁకొన్నమాత్రనే
యెట్టిదో తాత్పర్య మెఱుఁగవలయు
నెఱిఁగి డెందానఁ జింతించిన మాత్రనే
దృష్టాంత మొకటి స్ఫురించ వలయు
స్ఫురియించి సరిఁజూచి పరికించుమాత్రనే
దొసఁ గింది లేదని తోఁచవలయు
తోఁచి యొక్కింత యాలోచించుమాత్రనె
''యౌరా! యథార్థమే'' యనఁగవలయు

గీ. స్వస్తుతియుఁ బక్షపాతము సంప్రదాయ
భంగమును, మత్సరము, శాస్త్రబాధ, నీతి
లోపమును, నింద, కఠినోక్తి దోఁపరాదు
కవి జగచ్ఛ్లాఘనీయమౌ కవిత గూర్ప.

ఉ. ఓరుపులేని వాఁడను మహోద్యమ మిచ్చి సుధీముఖంబునం
దీరుపులేనివాఁడను, విధిచ్యుతి లేని కృతిన్ రచింపఁగా
నేరుపులేనివాఁడను, గుణిప్రకరం బెపుడైన నిందు నా
కూరుపుఁ జూచి చీ! యనునొకో? తలపెట్టితి నేమి సేయుదున్.

ఉ. లోకములోని యెల్లనరలోకముల న్నిఖిలప్రవృత్తులం
దేకముగా సృజించెను మహేశుఁ డటంచుఁ దలంచి యెవ్వఁడా
లోకము సేయు, వాఁడె యతిలోక మతిక్రముఁ డంచు గీతలం
దాకమలాతరంగవిభుఁ డర్జునుతోడ వచించె వింటిరే?

ఉ. నందునినందనుండు విడనాడె భువి, న్గలి వచ్చె నాఁడె య
న్నందున నాఁటనుండియును నాలుగుదొమ్మిదితొమ్మిదీరువో
నందననామవత్సరమునన్ శుభపౌష సితాష్టమిన్ ధరా
నందననామవాసరమునన్ దొరకొంటిని దీనిఁ జేయఁగన్.

కం. పదునెనిమిదివందల తొం
బది రెండగు నాంగిలేయ వత్సరమున ని
ర్వదియెన్మిదవ డిశంబరు
మొదలుగ నివ్విధిఁ జెప్ప మొదలిడితి వెసన్.

# తెలుఁగునాడు

## బ్రాహ్మణ ప్రశంస

### వైదికులు

చ. వచనములందు మార్దవము, వస్త్రముల న్మడి, వంటకంబులన్
బచనము సేయు చేతిపరిపాటి, శ్రుతిస్మృతిచోదితక్రియా
నిచయమునందు భక్తి, గృహిణిన్ సుఖపెట్టుట, వాసవాటికా
శుచితయు వైదికోత్తముల సొమ్మనవచ్చు నసంశయంబుగన్.

సీ. చదివిరా ! ఋగ్యజు స్సామముల్ భూర్భువ
స్సువరాది లోకముల్ సుతులు మ్రుట్టు
మెదపిరా ! పెదవి గుంఫిత మృదు స్తుతిపాఠ
సల్లాపముల నల్లరాళ్ళు గఱఁగు
తలఁచిరా ! క్షేత్రయాత్రలు సేతు కాశికా
గంగోత్తరలకు మూఁ డంగలీదు
నిలిచిరా ! సత్కర్మనియతి న్మహాధ్వర
కాండంబు పౌండరీకంబుదట్టు

గీ. పఱచిరా ! పంచపాళి దర్భాసనములు
ముక్కుమూఁతల సరిపుత్తు రొక్కజాము
బళిర ! యీపాటి పరిపాటి దెలుఁగునాఁటి
వైదికునితోటి యేమేటి వచ్చు సాటి.

చ. శమము దమంబు శౌచమును సత్యము శ్రౌతము స్మార్తమున్ మృదు
త్వము సరసత్వ మార్యజన వందనతృప్తి విగర్హిత క్రియా
విముఖత యప్రమాదము వివేకము నీశ్వరభక్తి నిశ్చల
త్వము నిరపాయజీవనము వైదికవృత్తిని మించ నున్నదే.

ఉ. నీళ్ళకు నిష్ఠతోళ్ళకును నేతికరుళ్ళకు దొడ్డయుత్తరేణ్
వేళ్ళకు దర్భముళ్ళకును వేదపునోళ్ళకు సన్నకట్టు వి
స్తళ్ళకు రావిపేళ్ళ కనిశంబును మళ్ళకు పప్పుఁగూర ప
చ్చళ్ళకు రాగిబిళ్ళకును సంతసమందుదు రాంధ్రవైదికుల్.

ఉ. తాతలనాఁటి సాలువులు దాపటివంక బుజాలపైఁ గడుం
బ్రాతఁదనానఁ జిన్గులగు బాటగునం చొకయింత వింతగా
మూఁతమడంచివైచి మొగము న్తెగఁబూసినబూది జాఱఁగాఁ
జేతుల రూరు లొప్ప ధనిఁ జేరఁగవత్తురు వైదికోత్తముల్.

చ. తెలతెలవాఱఁ గాల్యములు దీరిచి స్నానముఁజేసి బూదిమై
నలఁది కుశాసనంబుల నొయారముమీఱఁగఁగూరుచుండి ని
శ్చలమతి సంధ్యవార్చి విలసజ్జపమాలిక వ్రేళ్ళఁ ద్రిప్పుచున్
మిలమిలఁ గన్నుదోయిని నిమీలనవైతురు వైదికోత్తముల్.

చ విడువకురా ! "ఉతోతఇషవేనమ"రా! అదిదుడ్డు రాముణా!
కొడక? యటన్న మాట విని కొంకి "ఉతోత ఇసే; నమంచు శి
ష్యఁడు" దనవెంట రా వడఁకుచుం గుడిచే నొకయక్షమాలచొ
ప్పడ నొకచేత దండమిడి బాటను వైదికవృద్ధుఁ డేగెడిన్.

ఉ. త్రుళ్ళఁగ నీరుకావి మడిదోవతికమ్ములు వ్రేళ్ళబిళ్ళకు
చ్చెళ్ళది కట్టి నీళ్ళుబుడిచెం బొకచేతనుఁ బట్టి దారిలోఁ
జిళ్ళల కొత్తుకొంచు నొకచేఁ దడికొళ్ళయిఁ బెట్టి పెళ్ళిపం
దిళ్ళకు భోజనాన కరుదెంచును వైదికశేఖరుం డిలన్.

సీ. మోకాళ్ళ దాఁటని మొరటు గావంచాల
నందియందనిగోఁచి యంటదోపి
పిల్లగాలికిఁ దూఁగి యల్లాడు చిన్న నే
రెడుగాయవలె జుట్టు ముడియవైచి
నడునెత్తి పెడచెంప. లెడనెడఁ గాన్పింపఁ
దల నొక్కయంగవస్త్రంబుఁ జుట్టి
గీరు గంధపు రేఖ దీర్చైన నొసటిపై
పసపక్షతల చుక్క యెసఁగ నునిచి,

గీ. బెదరి చూచుచుఁ బెఱవారి కొదిగికొనుచు
జందెపోగులు చిక్కువోఁ జమిరికొనుచు
నోట నొకబుక్కు ముమ్మాఱు నొక్కి యనుచు
శ్రోత్రియ క్షితిదేవతాసుతుడు వెడలు.

ఉ. లేవరు లెండు లెం డనిన, లేచినవారయినం దటాలునం
బోవరు, పోవుచున్ నిలిచి పోదుముపోదుము త్రోయకుం డటం
చీవరు సందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్య సం
భావననాఁడు చూడవలె బాపన సాములసాము లన్నియున్.

చ. అనుదిన మంగపంచకము నందఱికిన్ వినుపించు బాపఁడా
దినమును వారఋక్షములు దెల్పు మఱిం గరణంబు యోగమున్
వినఁబడఁజెప్పి త్యాజ్య మొక వింతగ నీడిచి చెప్పి పైపయిన్
బనిగొని "రావె కేవె" యని పాఱున దేమిటి చెప్పుమన్నదా
వినఁ డవి రాహు కేతువుల వేధ లటంచు నెఱుంగ కజ్ఞుఁడై.

ఉ. సత్తుగ దేవతార్చనపు సంచుల నున్ననివేల్పు రాళ్ళకున్
వత్తులు గాల్చి పూవు లిడి వాసనదూపిడి గంటగొట్టి మా
కత్తెసరంచు లౌక్యులగృహంబుల జొచ్చిన వైదికోత్తముల్
కుత్తుకనిండఁబచ్చడియుగోరస మన్నము దింద్రు నిచ్చలున్.

శా. గంగాజోస్యులవారు మీకును నమస్కారంబటంచు న్వెసన్
వేంగప్పంతులుగారు పల్కవినుచున్ వేదోక్తమాయుష్యమం
చుం గేల్దోయిని జాచి పల్కి నగికొంచున్ భోమహారాజ! యే
భంగిన్ మాబ్రతుకెల్ల మీదని స్తుతిపంజొత్తు రాశ్రోత్రియుల్.

మ. విను నే మెచ్చిన మెచ్చులా? యనృతమా! నీకల్పవృక్షంబునీ
డను నీజందెపు చాటునం బ్రతుకువాఁడన్ గొప్పసంస్థాన మెం
దునఁబో నేసిన మీవె మాయమృతమస్తుల్ మాప్రభో! పేదవాఁ
డను గాపాడు మటంద్రు వైదికులబిడ్డల్ లౌక్యులం గాంచినన్.

సీ. ఉదయించుచున్న సూర్యునివంటి గుండ్రని
ముతకకుంకుమబొట్టు మొగమునిండ
కొయ్యకరాటానఁ గొని వ్రేల మెదిపి రా
చిన నూనెకాటుక కనులనిండ

అట్టిట్టు గదులాడునట్టి మేల్మిత్యాల
ముక్కుపో గొకప్రక్క మూతినింద
గోటంచుతో బొద్దుకుట్టు గుట్టిన గట్టి
పైఠిణీ మోచేతిపట్ల నింద

గీ. మాలనూలును చీరెల సాలినేఁత
మూరగలిగిన దళముగాఁ బుంజ మిడిన
మేలికమ్మి సొగసుచీరె మేనునింద
బ్రియుఁ గదియుఁ దెల్గునాఁటి శ్రోత్రియవధూటి.

శా. ఆస్నే; చూస్నివషే; వొషే; చెవుడషే అస్లాగషే; యేమిషే;
విస్నావర్ఘులవారిబుఱ్ఱినష యూ విస్నాయ కిస్నారుషే
విస్సం డెంతటివాఁడె యేణ్ణపదిషే; వెయ్యేళ్ళ కీదేషమా;
ఓస్నే బుఱ్ఱికి యీాడషే; వొయిషు కే ముంచుందిలే మంచివా
ర్చెస్నే;యందురుశ్రోత్రియోత్తమపదస్త్రీ లాంధ్రదేశంబునన్.

సీ. కోడికూయఁగ మేలుకొని తలవాకిలి
పైపాచిజిమ్మి కలాపిఁ జల్లి
దడదడగా దంతధావనం బొనరించి
యిల్లలిక్కి ముగ్గిడి యెనుముఁ బిదికి
పొరుగింటి కేగి నిప్పును దెచ్చి రాజేసి
మడివలువల నుత్కి పిడిచి మడఁచి
బుజముపై నిడి దండెముల నాఱవైచి కూ
రలు దర్గికొనియు దండులము లోడ్చి

పసుపు రాచుక నీళ్ళు పైఁబోసికొని బట్ట
తడిది గట్టుకొని తీర్థంబు దెచ్చి
నాలుగుసేర్ల తప్పేల దబ్రాగిన్నె
రాచిప్పయొకటి పొయ్యిరాళ్ళఁ బెట్టి

గీ. కళపిళ నెసళ్ళు గ్రాఁగించి కమ్మనైన
వంటకాల్చేసి విస్తళ్ళ వడ్డనమ్ములు
పొసఁగఁ గావించి భయభక్తి పూర్వకముగ
నుపచరించును వైదికయువతి పతిని.

చ. వసుధ నియోగి బాలికను వైదికబాలున కిచ్చి చేయఁగా
బస నది యిట్టునట్టనిన బాగషునిష్షను మంచు నత్తయ
బ్బెసమొనరింప నొక్కతఱి పీషష ? పెష్షష ? మామగారికిన్
మసలక ''పెష్షపెష్ష'' మను మాషలెపల్కె నషంద్రుగష్షిగన్.

ఉ. పావనమైన వైదికుల భాష గొఱంతలు పట్టి తెల్పుట
బ్బా ? వినరాదుగా జెఱకు వంకరటోయిన యంతమాత్రనే
పోవునె తీపి ? కొంద ఱిది పోల్పరు వైదికుపిల్లి వ్రత్తి మేవ్
మ్రే వనునంద్రు రేఫమది శ్రీకరమున్ శిఖిబీజముం గదా.

## నియోగులు

చ. బదిపదిఁబాంథబాడబులు బ్రాహ్మణగేహము గోరుచున్న నీ
నడువడియెల్లఁజూడు కరణాలను బ్రాహ్మణు లందువా; సరే
వడి నడువీధిలో నిలకు వచ్చినదారిన పొమ్ము పొమ్మటం
చడుగునఁబుట్టుమంట తల కంట నదల్తురు లౌక్యభూసురుల్.

సీ. మెలిఁబెట్టి విడిచిన మీసాలపై గొప్ప
నిమ్మకాయలు రెండు నిలుపవచ్చు
తేటగాఁదెల్లగా తెగఁగాలు లంకాకు
పొగచుట్ట జుంజురుఁ బోల్పవచ్చు
నడువీధి రెడ్డిగా లిడి రచ్చ దీర్చుచో
సివిలుజడ్జీ లని చెప్పవచ్చు
అసదుగాఁ బొసఁగించి నొసటఁ బెట్టినబొట్టు
లొక్కమా "ఉప్పని యూఁ" దవచ్చు

గీ. వడివడిగఁ జిన్ననాఁడైన వడుగునాఁడు
తడఁబడుచుఁ జెప్పుకొన్నట్టి తప్పుసంధ్య
ముక్క నాలుగు నిముషాల ముగియవచ్చు
బళిర ! యనవచ్చు లౌకికబ్రాహ్మణులను.

శా. జ్ఞానాధిక్యము, శాంతి, యర్థిజనరక్షాదీక్ష, భూపాలకా
స్థాన ప్రాపిత వైభవంబు, పటుమంత్రప్రజ్ఞయున్, సంతతా
క్షీణం బుగ్గునఁబెట్టు తల్లియె నియోగిబ్రాహ్మణశ్రేణికిన్
మానంబేనగ, మాట లేకవచముల్ మర్యాదలే భాగ్యముల్.

ఉ. ముచ్చిలి గుంటజుట్టుముడి మ్రోయఁగ నెత్తిఁగుళాయి యిస్త్రీ
యిచ్చినకోటు మేన ధరియించి బుజాన రుమాలువైచి లేఁ
గచ్చను జీరుగోఁచి యిడి కట్టిన మల్మలు చెంగు జాఱఁగా
నిచ్చి చెడావులం దొడిగి యేగు నియోగిసుతుండు నిచ్చలున్.

ఉ. ద్వారముఁ జేరఁగానె యవధానులుగా రదె వచ్చిరే నమ
స్కారములంది రండి పఱచండి కుశాసన మౌనుగావి గో
చారబలంబు నా కిపుడు చాలునొ? చాలదొ? చెప్పుఁడీ పరి
ష్కారముగా నటంద్రు సరసంబుగ వైదికుఁ గాంచి లౌకికుల్.

చ. కరణము మంత్రసాని; సరకారు ప్రసూతిక; రైతుబిడ్డ ని
బ్బరమగు వ్రాఁతకోఁతలు జవాబుసవాళ్ళను దంత్రయుక్తి బం
ధురముగ నూరిమీఁద నొక నూరయినంబడుఁగాక యెన్నఁడుం
గరణముమీఁదనొక్కయఱ కాసయినంబడదంద్రు మానవుల్.

చ. నిరుపమబుద్ధిశాలి కరిణీకముఁ జేసిన యూరికాపు లె
ల్లరు భువిఁ బాలుబొంగినటుల న్మదిఁ బొంగుచు 'దొడ్డవాఁడుమా
కరణముబిడ్డయింటఁ గలఁకాలము మేలగు' నంచు గంగఁగొ
ల్తురు; సరికానివా రతని దొడ్డిన మేపుదు రాలమందలన్.

చ. నడవడిమంచి వ్రాఁతకరణంబతఁ డెప్పుడు వ్రాయుచుండఁగన్
దడదడ మ్రోఁగుఁగూఁతకరణంబతఁ డన్నిట సున్నయిందఱిన్
దడఁబడఁ జేసి మేఁతకరణంబు గుటుక్కున మ్రింగు నెల్ల రా
బడులును బెళ్ళికట్టములు బందరుపజ్జన కొన్ని యూళ్ళలోన్.

చ. కరణము నంజనేల దరఖాస్తులకాలమె పంటకళ్ళ మం
చెరఁబడి చేయిసాఁప రయితెట్లనొ చౌలము పావు దెచ్చి య
క్కఱగడ తేర్చుమం చడుగఁగా "నెకరానికి మాడమేర కం
దఱు నొసగంగ నీనొసటనా? యుదయించెను బ్రొద్దుపొమ్మనున్.

ఉ. ఓరీ! చాకలి కాళ్ళు గ్రుద్దు మని యెన్నోసార్లు నేఁ బిల్వలే
దా! రావేమిర? తిమ్మిరెక్కినదొ లేదా బుద్ధి నీచాకి రం
చేరేవో యిఁక జూఁడు నీమదము నాకెవ్వార లడ్డంబురా?
తేరా దప్రమటంచ్రు గ్రామకరణా త్తీవ్రప్రభావంతులై.

శా. నమ్మిన నమ్మకున్న నది నావశమా! జను లాడుకొన్న వా
క్యమ్ములు నేను జెప్పెద భయంపడియో పడకో! నియోగిలో
కమ్మనివార్యకార్యఘటకమ్మవుఁగాని పరోపకార శూ
న్యమ్మను స్వప్రయోజనపరాయణమున్ దలపోయ నిద్ధరన్.

చ. ముదికరణాలు రాముగుడిమోసల రచ్చలుదీర్చి భారతాల్
చదువుచు లోకవార్తల బ్రశంసల నంద్రు తెలుంగు భాషమం
చిది మనపిల్లకాయలు వచించెడియింగిలిపీసు పుస్పుసన్
బెదవులు దాఁట దెంతటి యెషేయు బియే యెమియే వచించినన్.

ఉ. ఈతటి జాతిరాచటిక మింతటి దుర్గతి దెచ్చెఁగాని మా
తాతహయాములో నుడుగు దాఁటినవారలఁ బట్టితెచ్చి చ
క్రాతను గట్టి కొట్టి పదిరాత్రు లటుంచిన రాజుతోడ వి
జ్ఞాతము సేయు వాఁ డొకఁడుగల్గెనె యందురు వృద్ధలౌకికుల్.

ఉ. స్నానముఁజేసి సంధ్య నిముసానవె దీరిచి బొట్టుఁబెట్టి పీ
ఠానను గూరుచుండి యెఱడా లరివాణము జోడు చెంబులుం
దా నమరించి మంచియరఁటాకున నన్నము గూరగాయలున్
దాను భుజించు నై సినపదార్థము గొంచు నియోగి నిచ్చలున్.

గీ. అడిగినది యిచ్చు త్యాగి సత్యమున సేగి
అన్నిగల్గినభోగి భార్యగలయోగి
చిలుమిడనిరాగి వండ నేర్చిన నియోగి
కంచు దివిటీలతోన జగాన గాన.

చ. గడబిడ చేసియైనఁ దనుఁ గట్టిగ మంత్రము సెప్పఁ దెప్పు డా
గడమునఁగట్టుసేయవలె గ్రామపురోహితు నంచు తప్పకన్
గడియలు లెక్కఁబెట్టి సరి కానిది యైనది చూచుకొందురే
బడబడఁ బాటఁ బాడినను బట్టఁగలేరు తెలుంగులౌకికుల్.

ఉ. యజ్ఞము సేయఁ గావలయు నన్నిటిఁగూర్పుఁడు నాఁ బురో
హితుల్
ప్రజ్ఞలు గొట్టి యిచ్చినవరాలను గై కొని మీరు వేదసా
రజ్ఞులు యాజమానములు రావలె నందు రనంగ లౌకికుం
దజ్ఞులహో! కొనుండు మన కవ్వియు నాలుగుబండ్లనున్వేసన్.

ఉ. కేలఁ గలంబు వట్టిన వకీలుతనం బొనరించుచున్న నే
కాలము దీర్పుఁజెప్పు, నధికారముఁజేసిన గాకితాలు ద
స్త్రాలగుఁ గాళ్ళకాయలగుఁ దప్పకొడల్ కనఁగాచుకొన్న చూ
లాలిని బోలు ఉత్తు చెడు లౌకికవిప్రులలోన నొక్కటన్.

చ. అనుపమ మేరుమందరగుహావళి మూయఁగవచ్చుఁగాని యీ
మనుజులనోరు మూయఁదరమా యనుకొం డ్రది యంతపట్టున
మ్మనలవికో నియోగి తన పచ్చయెకాని సహింపఁ డన్యుప
చ్చ ననుచు దాని కేమి విరజాజులు రాజులునైన మట్లనే.

మ. కౌమరుంబాపట కడ్డమై మొగలిరేకుం దమ్మలంపాకు నం
దముమీఱన్ జడచుట్టపై నిడిన సాదాబిళ్ళపైఁ బచ్చతా
లు మురాళింపఁగ గూబకుట్టులనుఁ దాలూకాలఁ జిల్లాలమ
చ్చెములం దుద్దుల బుష్యరాగములఁ దాల్చిఁకట్లుపో మొత్తనె
య్యమున నృర్తల ప్రీతిగొల్పుదురు లౌక్యబ్రాహ్మణ
ప్రేయసుల్.

## స్మార్తసాధారణవిషయములు

ఉ. కమ్మనిమాట యొక్కటి సుఖమ్ముగఁ జెప్పెద నాలకింపుఁడీ
యెమ్మెను భోజనంబులకు నేదయినన్ శుభకార్యవేళలన్
రమ్మని యెంత బిల్చినను రా రొకపట్టున లౌక్యభూసురుల్
పొమ్మని యెంత గెంటినను పో రొకపట్టున వైదికోత్తముల్.

చ. మసలుచుఁ గర్మకాండమును మాయముఁ జేసిన రీతి జూచియున్
బస లలితప్రవర్తనము బావినిఁ ద్రోచినభాతిఁ జూచియున్
వసుధ నియోగిసంధ్యయును వైదికు చేతివిడెంబటంచునున్
హసనముఁ జేతు రెల్లపుడు హా పెళవారలు కోడిగాలకున్.

చ. పొసఁగు సమస్తము న్గలముపోటున మేటినియోగి కెప్పుడున్
గొన కళిలంబు వైదికునకున్ సమకూరును దర్భపోటునన్
వసుమతి నేలువారలకు వచ్చు సమస్తము నీటెపోటునన్
బస నని కొంద ఱిట్లు తెలుపం దొరకొందుడు కోడిగాలకున్.

ఉ. ఈయిసుకోలుబళ్ళకడ నింగిలిపీసులు పీసుపాసుగాఁ
గూయఁ,నఁజొచ్చి యామయిలగుడ్డలు వంకెదగిల్చిరండు మొ
ఱ్ఱో యన నాలకింప రిసిరో! కలికాలము గాలె రామ రా
మా యను వృద్ధురాలయిన స్మార్తవితంతువు మాటిమాటికిన్.

ఉ. కమ్మని కందిపప్పు నురు గారఁగఁ గాచిన నేతిబొట్టు దూ
రమ్మున దావిగ్రమ్ముకొనిరాఁ బొగుపెత్తిన యాకుఁగూరలుం
గుమ్మడివొట్ల కాఁకరమునుంగయు నంగయు దొండబెండశా
కమ్ములు దప్పళంబులను గల్పి భుజింతురు శాలితండులా
న్నమ్ములు బ్రేవుమంచనుదినం బరటాకులలోన బ్రాహ్మణుల్.

శా. అచ్చమ్మా యిది యేమిటే; రెయిలటే ఆసీ యిదేనా; సరే
బుచ్చమ్మాఁ వినలేదటే గడియలోఁ బోవచ్చునే కాశికిన్;
అచ్చో దేహము గ్రుద్దుకోదటే అయో ఆసౌఖ్య మేమందునే
యిచ్చారాజ్యమటంద్రు పై గినుగనియెంతే వింత విప్రాంగనల్.

ఉ. అంతయు నొక్కటే సకల మాత్మయె నీ దిది నా దిదంచుఁ గా
సంతయు నెన్నరాదు తన యాలయ, దార. ధనాదులన్నియున్
భ్రాంతులటంచుఁ బ్రత్యహము పల్కుచుఁ దప్పకచెప్పి శుష్క వే
దాంతులు కొంప దోఁతురు కడాపటఁ జోగినిఁ జేతు రజ్ఞులన్.

చ. వలదని నేను చెప్పి గెలువంగలనా? యిఁకఁ జాలుఁ జాలు నేఁ
దెలియక యొక్కటన్న నలుదిక్కు లనన్ బదియంద్రుకానిలే
తెలిపెదఁ దెంపునం దెలుఁగుదేశపుస్మార్తుల వియ్యపొత్తులన్
దలచిన ధర్మశాస్త్ర పరతంత్రులు గారనవచ్చు వారలన్.

చ. చెలఁగి నియోగిశాఖలను జేతురు వియ్యము భేద మెంచ రు
జ్జ్వలమతులై నకొంద ఱిఁక శాఖలు మూడును నాఁడునాఁటికిన్
గలయుచువచ్చుచున్నయవి గాని యదేమొకొ తక్కుభేదముల్
దశముగఁ బట్టుకొన్నయవి దైవవశమ్మున నాంధ్రమండలిన్.

మ. వెలినాఁడున్ దెలగాణెమున్ మురికినా ద్వేఖ్యాతము న్వేఁగినా
డు లలిం గౌసలనాఁడు నానయుదునాఁడుల్ ఋగ్యజుస్సామవి
ఖ్యలశాఖాత్రయివారు ద్రావిడులు సత్యాషాఢు లార్వేలవా
రలు బల్ నందవరీకులున్ దమిళవారల్ పాకనాఁటీలు; స్మా
ర్తులలో వి స్తరిపొత్తె వియ్యముల పొత్తుల్లేవు వింతయ్యెడిన్.

## మాధ్వులు

సీ. "జావు లా" వని తురుష్కవ్యాహృతులు సెప్ప
"సాకు భే" కని స్వభాషలు వచింప
పంతులవారి ప్రభావంబు వెలయింప
నాచార్యభావంబు నధికరింప
ఓర్పుతో రాజకీయోద్యోగములు సేయ
ఘనభక్తి దేవతార్చనలు నెఱప
భోగినీయోగ సంభోగంబు చాటింప
దివిరి సాలగ్రామతీర్థ మాడ

గీ. చాల మీగాళ్ళఁ దూల నీమాలఁ దొడుగ
తప్పకను మేనఁ బంచ ముద్రలు వహింప
లౌక్యవైదికములు చెవుల్ పట్టిలాగ
మాధ్వు లొప్పుదు రీయాంధ్రమండలమున.

సీ. గట్టిగా నొకపట్టు పట్టించె నేని ము
ప్పత్తుహోళిగ తృణప్రాయ మనును
స్వస్తుతిన్నమ్మదే వరదొడ్డ దేవర
తెలియ ముఖ్యప్రాణ దేవర యను

పరనింద నిమ్మదేవర యేను దేవర
రబ్బిగుండాకార రూఢి గనును
తత్త్వబోధలు సేయుతఱిని జీవపదార్థ
బేరె యీశ్వరవస్తు భేద యనును

గీ. ఘనతరాంగారపుండ్ర శృంగారకలిత
ముఖమె సుఖమను మైగంధ లిఖితముద్ర
భద్రవితరణ కరణ నిర్నిద్ర యనును
మాధ్వుఁ డనిశంబు నీయాంధ్రమండలమున.

ఉ. బేరము లేని బేరి, శరవేగముఁ బెట్టని నారి, దంధణల్
బాఱనిభేరి, ధర్మపరిపాలన లేని కచేరి, స్వచ్ఛమై
పాఱనివారి వంటకము బాగుగఁ జేయఁగ నేరనట్టి వ్యా
పారి, యవాహకం బగు సవారిన బోలుదు రాంధ్రభూస్థలిన్.

ఉ బాగుగనున్న వానికడ బంధువులెల్లరుఁ దారె చేరి యే
లాగుననేని వాని బదిలంబుగఁ దంటనపట్టిపైతు రా
త్యాగియు నాయమున్ వ్యయము నారయ కూరకనోడుఁ దానుఫే
ణాగణపూరిగళ్ ప్రతిదినంబును దప్పరు మాధ్వలోగిటన్.

సీ. మాతుగళిల్లెనమ్మ గురురాయర మహా
మధ్వరాయ స్తోత్ర మాడు బేకు
మంత్రగళ్ హేళినామగళు స్మరిసి హను
మద్దేవరార్చన మాడుబేకు

మహిమఁ దత్త్రైలోక్యమాత శ్రీతులసిక
నోడి ప్రదక్షిణ మాడు బేకు
అతిథక్తి శ్రీభాగవతకేళి నందకు
మార నమస్కార మాడు బేకు

గీ. మహితపుణ్యనదీతీర్థ మాడు బేకు
మానితాంగారపుండ్రగళ్ మాడుబేకు
బేకు బేకు సదా బేకు బేకు బేకు
అనుచు మాధ్వులు భాషింతు రనుదినంబు

ఉ. కన్నడబాస లోఁగిట, నిఁకం దెలుఁ గందటితోడ, బైటిక
ట్యున్నతమైన బెబ్బులి ప్రయోగము, లోపట మేఁకపోతు కా
ల్వున్నయెడ న్నవాబు పనియాడిననాఁడు పకీరు, భూస్థలిన్
గన్నసనత్కుమారుఁడు పగల్, నిశిగాముఁడు మాధ్వ డెన్నగన్.

మ. విసరుం జేతిరుమాళ్ళతో నడుగులన్ విప్పారు నేమాలతోఁ
దసుకాడుం బయిజార్లతోఁ దలల నూదారంగు పాగాలతో
వెసఁ బట్టంచులుజాలు పైవలువతో బేషక్ కలందాన్లతో
బస వార్ధక్యముఁ లోన దాఁచగలరా పంతుళ్ళవా రిద్దరన్.

శా. సారోదారులు సాహసోద్ధతసమాచారుల్ వినోదార్థవి
స్తారుల్ ధీరు లలుత్ప్రతాపశిఖిసంతప్తారు లత్యంతగం
భీరుల్ శూరులు దానశౌరులు బదర్ ఫేణీ మిఠా లడ్డు కా
హారుల్ పంతులువారు పొల్తురు ధగన్ వ్యాపారులై పాఖలన్.

సీ. కదుఁజెల్వమగు బెండకాయబొట్టు మొగాన
దతగంధముద్రాంకితములు మేన
మడచి తీర్చిన జరీ మధిరయోణి బుజాన
వెలగల యుంగరా ల్వ్రేళ్ళపైన
అపరంజివిడికడియము మణిబంధాన
పగడాలసరము చొప్పడు గళాన
పట్టంచు దట్టంపు బలుతీకు పుట్టాన
మేలుముత్యాలతమ్మెట్లతోన

గీ. దస్త్రు మపసవ్యమునఁ గలం దాను సవ్య
భాగమున నుంచి కలము చేపట్టి గోవ
కాగితంబులపొతక మ్రోకాల నునిచి
ఫరుదు బరపర వ్రాయు వేపారిఁ గంటె.

ఉ. సమ్మతి నమ్మకర్మ సహజంబగుకర్మ యటంద్రు నిమ్మక
ర్మమ్మది దుష్టకర్మ యని పల్కుచునుందురు నోటి కేదియ
డ్డమ్ము జగమ్మునం భళభళాభళ మాధ్వులవంటివారు ని
క్కమ్ముగ లేరులేరని పుకారు పకారులు కారు కారిలన్.

శా. ఔనోయీ నరసింగ రాయఁడ హుకుం అంపించినావా, మదార్
ఖానున్ చిత్తము వానిఁ బంపిన పనుల్ కావచ్చు సందేహమా?
సానాభోగముదా? మహాప్రభుఖులాసా కేమి యేముండయో
తానాగన్నెఱసేయు నున్నతపదోద్యన్మాధ్వుఁ డత్యుగ్రుఁడై

శా. వీటీమోది విటీనటీకుచతటీ విన్యస్తపాటీరయు
క్ష్మాటీమోదికటీపిటీ పటువచో జంఝూటధీరార్భటీ
ధాటీమోదిఘటీఘటీకృతశఠా దత్తార్థవిప్రార్యయః
పేటీమోది వినోది మాధ్వధరణీబృందారకుం డిద్ధరన్.

ఉ. మాధ్వగురుండు వచ్చు నొకమాఱు పదేండ్లకు, వచ్చివారిధ
ర్మాధ్వ మదే యటంచు వరహావరహా యొకయగ్నిముద్రకున్
సాధ్వసలీల నిచ్చినను సాకన డింకను బేకు బేకు బే
కుధ్వని సేయు, మోక్షమునకుం గరణంబు హిరణ్యమే సుమీ.

చ. విరివిగ నేయి నూనియల వేపుడుకూరలు మెండుమెంతి చ
ల్లొరుగులు నూరుబిండులు ననూనము లప్పడము ల్వడెంబులం
బొరిఁబొరి నొందునుం దిరుగఁబోఁ తలనిండువలెస్సమంచిపాల్
పెరుగులువెన్నమీఁగడలు పెంపుభళాభళిమాధ్వులోఁగిటన్.

సీ. ఒఱపైన వలిపెంపు చెఱఁగుగోచీకట్టు
తాటిముచ్చికవంటి తాలిబొట్టు
చేతుల నపరంజి చిన్నారిపోచీలు
మేలైన మెడఁ బిరి కీలసజ్జు
కడుతీవి నడుమున గంటల మొలనూలు
నెఱిగుల్కుదమ్మెలఁ గరణిపూలు
పదయుగంబున వెండి పాంజేబు లందెలు
బటువుగుబ్బలబిగి పైటిణీయు

గీ. గలిగి బంగారుకీల్బొమ్మ వలెనె హంస
గమనమున మెల్లగఁ బడకగదికిఁ జేరి
యలరి పతితోడఁ జెంగ్లాట లాడి యిష్ట
భోగములఁ దేల్చు వ్యాపారిపూవుఁబోఁడి.

మ. అనువారం బొకనోము స్నానములు మెండాచారము ల్చెప్పఁజా
లనువస్త్రంబులయందు దేహములజాలం బారిశుద్ధ్యంబు మా
టను మాధుర్యము ధైర్యముం దెలివితేటల్ చాలు నొఁగాని యే
పనియున్ గట్టిగఁజేయనోరువరు వ్యాపార్యంగనారత్నముల్.

సీ. బెళగావ్ తలేహెద్దు బేగవుదంతథా
వన మాడి స్నానపు మాడికొండు
మడిగట్టుకొండు నే మకకూడి దేవతా
ర్చనమాడికొండు బె చ్చగెపదార్థ
ఈళగెభోజన యిట్టికొండుం దాను
మధురభోజన బేగ మాడికొండు
తెలెబాచియనొడివి గళహాకికొండు వి
ష్ణగెపురాణపుకేళి సఖగళవరు

గీ. కూడి హువ్వి వనకె హోగి కొద్దు హువ్వి
గళసరపుమాడియన్ రాత్రి కాలపతిగె
భూరిసంతోషదిందతాన్ భోగిసురుళ
కృతసుకృతపాణి వ్యాపారికీరవాణి.

ఉ. కన్నులు ద్రిప్పు సోలు గటకాముఖహస్తముఁ బట్టు జాఱుగా
వెన్నున నున్నపైఁట నొక వింతగ నంతట సర్ది నిండుగాఁ
బన్నక వెంకుబాయి తులసిబాయి మొదలైన సఖీజనంబుతో
గన్నడబాస మాధ్వసతి కందువలాడు విధంబు గంటిరే.

మ. తెమలున్ బుణ్యవతీవిలాసము లధోదేహంబునం, దూర్ధ్వదే
హమునన్ బోడితనంబు,నోటనునృసింహస్తోత్రముల్కన్నులం
బ్రమదావర్తనముల్,మెడందులసికామాలల్,కయిన్బుష్పహా
రములున్, మాధ్వవితంతుయౌగపదసారాసారశోభ ల్తగున్.

మ. నిజమో కల్లయొ నే నెరుంగనునరుల్ నిందింత్రునిచ్చల్ నియో
గిజనశ్రేణినిఁ గుక్కగుంపనుచు, నగ్గిం ద్రెప్డు మాధ్వద్విజ
ప్రజలన్ గాకు లటంచు, వైదికులరాబందుల్గదాయంచు, బే
రజమాడం దొరకొంద్రు దీని కొకమేరం గారణం బుండెడిన్.

## వైష్ణవులు

సీ. గండభేరుండంచు గల ధోవతీకట్టు
కొమరైన పట్టెనామములబొట్టు
కడుఁబెద్దముడికిఁ జొప్పడెడి నందెఁడుజుట్టు
నితరుల కెఱుకగా నీనిగుట్టు
సామాన్యులకును దుస్సాధ్యంబయినబెట్టు
ద్రవిడభాషాప్రబంధములఱట్టు
కఱ్ఱతోఁ దోలినఁ గాని పాఱనితట్టు
తట్టంపు తెఱచాటు తళియపట్టు

గీ. అట్టులిట్టుల ననరాని యట్టియట్టు
లెట్టు లేదమ్మిపేశిలో నెట్టునెట్టు
గట్టిగాఁ దెల్గుదేశంబు బట్టినట్టి
వీరవైష్ణవులను దొట్టు వారుమట్టు.

ఉ. ఆసరసోక్తి, యామృదుత, యాగురుభావము, నాప్రసన్నతా
భ్యాసము, నామఖోద్యత విభాసము, నచ్యుతదాసదాసవ
ద్దాసవరేణ్యదాసభటదాస తదీయకథానదాసవి
న్యాసనితాంతనైచ్యనటనాభినయంబును, వైష్ణవార్థముల్.

చ. తళతళ నెల్గుఁబాఱ నిరతంబును దోమిన తామ్రపాత్రముల్
మిలమిల నున్నగా నలికి మెత్తిన యత్తిరుమాళిగలీ, కడున్
బెళబెళనాఱ దండెముల వ్రేలగవైచిన ధౌతవస్త్రముల్
భళిభళి వైష్ణవోత్తములపాలిటి భాగ్యము లేమి చెప్పుదున్.

సీ. చిటికిమాటికి శ్రీమతే రామాను
జాయ నమో యంచుఁ జదువుసొగసు
నిరుపమభక్తిచేఁ బెరుమాళ్ళనుఫిరాట్టు
దిరువడిఘళ్ గొల్చి యెఱుఁగుసొగసు
సారెసారెకుఁ దిరువారాధనంబులఁ
దిరువాయిమొదిఁ నోటఁ దెలుపుసొగసు
జ్ఞానులఁ గని యడియే నడియేను దా
సోహమ్మనుచుఁ బల్కుఁ నట్టిసొగసు

గీ. పరఁగఁ బన్నిద్దరాళ్వార్లఁ బరమభక్తి
మించి తిరుమంత్ర మొనర సాయించుసొగసుఁ
బొగడుచో వేయినోళ్ళకు మిగులుగొంత
వైష్ణవబ్రాహ్మణులదె దైవప్రపత్తి

సీ. తిరుమణి తిరుచూర్ణ తిరుణాళ్ళు తిరుమంత్ర
తిరుమాళిగయుఁ దిరుక్కారియమధులు
తిరువీధి తిరుగలు తిరునామములు తిరు
వారాధనము తిరువాయి మొదియు
తిరువధ్యయనమును తిరుమంగ యాళ్వారు
తిరువేళికయు మఱి తిరువడిఘళు
తిరుపతి తిరుమల తిరువీనములు తిరు
ప్పణ్ణేరములు తిరుప్పావు మఱియు

గీ. తిరువలిక్కేణి తిరువటూ ర్తిరువనంద
పురమును దిరువళ్ళూరును తిరుతుళసియు
తిరు తిరు తిరు త్తిరు తిరుతిరుతిరు
దిరుగు వైష్ణవ పరిభాష తెఱవు మఱుఁగు.

ఉ. ధారుణిమీఁదఁ గాళ్ళొరయఁ దట్టుపయిన్ దగఁ గూరుచుండి వి
స్తారపుమోపుగట్టి మడిసంచులు ముందిడి, వెన్క దిండి సం
బారపుమూట పెట్టి యెడఁ బాయనిదాసుఁడు దోల శిష్యసం
చారముకై ప్రయాణమగు స్వామిని త్రోవనె చూఁడగావలెన్.

సీ. ఘుంఘుంఘురూం ఘురూం ఘుంఘు మ్మటంచును
బూరగొమ్ములవారు ముందు నడువ
ఢండండడండఢం ఢంఢ మ్మటంచును
ఢంకాలవా రొకవంక నడువ
ఖిణ్ఖిల్ఖిణిల్ఖిణిల్ ఖిణ్ఖిలటంచును
గిలకకఱ్ఱలవారు కెలన నడువ
గుళగుళగ్గుళగుళ గ్గుళగు ళ్ళటంచును
గురుసంస్తుతులవార లొరసి నడువ

గీ రంజితములైన ముత్యాల పింజరీల
పైడియడ్డల బంగారు పల్లకీల
చెలఁగి తిరువీధి వేంచేపుఁ జేసికొనుచు
వచ్చు జియ్యలవారు శ్రీవైష్ణవులను.

సీ. పల్లకిపై నెక్కి బహుజనంబులు గొల్వ
బూర లూదుచువచ్చువార లొకరు
బడుగు గుఱ్ఱంబులపై నెక్కి కావటి
వానిఁ బెట్టుక వచ్చువార లొకరు
సాలుఁజుట్టుక కుండలాలు వ్రేలఁగఁ బాద
చారులై చనుదెంచువార లొకరు
తలలు మాపుక ఛత్రధారులై యక్షయ
పాత్రఁ బుచ్చుకవచ్చు వార లొకరు

గీ అవని శ్రీరంగమున వేంకటాచలమున
యాత్ర లొనరించువారల నాశ్రయించి
తీరి కూర్చుండి గడియించు వార లొకరు
బహువిధంబులు వైష్ణవ వర్తనములు.

ఉ. దోసమువచ్చునంచు మదిఁ దోఁచెడినందునకేమి సేయుదున్
జేసినపాప మెప్పుడునుఁ జెప్పినఁ బోవును వైష్ణవుం డుప
న్యాసము జేసెనా? విడువ కాఱునెలల్ వినువారిమంగళా
శాసనశక్తి యెట్టిదొకొ? చప్పునఁ దీరును లౌకికార్థముల్.

చ. వినుమని చెప్పఁ బూనితిని వింతకు, నన్నెవరైనఁ జెప్పవో
యని పలికించిరా! యనృతమాడఁగఁగారణమేమి? మాట దాఁ
చను జలికోఁతమందుసుమి సంసరణ వ్రణపూర్ణశాంతికిన్
ఘనుఁడగువైష్ణవోత్తముముఖమ్మునఁ బొందుమహోపదేశముల్

చ. చెవిఁ బడరాదు సాంబ శశిశేఖరశూలధరాది నామముల్
సవనము లెందుఁగాన మిఁక స్నానము లాగళముల్ ప్రచారమా
వివిధము సంధ్యసంగ్రహము వెల్లువ లద్భుతకైతవాత్మసం
స్తవములు వైష్ణవోత్తములతత్త్వములం గొనియాడశక్యమే.

ఉ. కోపము వచ్చునేమొ మదిఁ గొంచెము నాకు భయంబుదోఁచెడిన్
దాపములెల్లఁదీర్చుటకు దాపమె హేతువటంద్రు మంచిదే
పాపము వైష్ణవోత్తములు పల్కినదే నిజ మెట్టులంటిరా
వ్యాపకమైన వజ్రమును వజ్రమె వ్రయ్యలు సేయఁజాలెడిన్.

శా. ప్రీతిన్ శిష్యునకున్ సమాశ్రయణ మర్థిన్జేయుచో బాహు
ప్రీతిన్ గంపిలఁజేసినన్ విడువ రర్విన్ వైష్ణవుల్ నిర్దయుల్ [వుల్
"తాతాచార్యులవారి ముద్ర బుజముల్ తప్పించుకోఁ గోరి కా
బూఁతం బాఱిన వీఁపుదప్ప" దనుఁ బూర్వోక్తి ప్రకారంబునన్.

ఉ. రచ్చలలోన నన్నుఁ బలు రవ్వల బెట్టిన నేమి వారికిన్
నచ్చిననేమి, కాక మఱి నచ్చకయుండిన నేమి చెప్పెదన్
పిచ్చియొ?వెఱ్ఱియో?నిజము, బేర్మిని వైష్ణవుఁ డెంతకాంచనం
బిచ్చిన నంతమోక్ష మను నీయకయుండిన ముక్తి లేదనున్.

చ తిరుమణి విష్ణుఁడుండు సిరి దేటపడన్ దిరుచూర్ణమందు సు
స్థిరముగ నుండు వైష్ణవుని దివ్యముఖంబున నిద్దఱున్ సదా
తరలక యుండ్రిఁకన్ దులసిఁ దామరనట్ల నెయుండ్రటంచుఁబ
ల్కురి హరు లెందఱో సిరులి కెందఱొ తద్ధరు లెందఱో ధరన్.

ఉ. గారవ మొప్ప శిష్యులకుఁ గమ్మని తియ్యని మంచిమంచి ప
ణ్ణేరము లారగింపుడని నెయ్యమునం దయచేసి కొంచుసాల్
వారిబదేంటి దీకొఱఁత లాగరు, లాగుటఁ జెప్పునప్పుడా
చారులవారిఁ జెప్పవలె స్మార్తులఁగీర్తుల నట్టుఁబెట్టుఁడీ.

సీ. చల్దినైవేద్యముల్ చాటుననేగాని
గ్రామదేవతఁ గొల్వ రాదటండ్రు
వఱుగుపచ్చడి దింట మఱుఁగుమాటేకాని
గోంగూర దఱికిరాఁగూడ దండ్రు
పులిహోరసాద మాకలిదీఱుటకెగాని
యేకాదశినిఁ దిండి హేయమండ్రు
ఆత్మసంస్తుతు లవి యాచారమేకాని
దురభిమానము చాల దూష్యమండ్రు

గీ. ఘనపటాటోప మెల్ల లౌక్యంబెగాని
దంభసంరంభములు సేయఁ దగదటండ్రు
చెట్టలకుఁ గొంత యుపపత్తిఁ జెప్పుచుండ్రు
వైష్ణవాచార్యస్వామ్యయ్యవార్లుగారు.

ఉ. చుంగులువార ధోవతులు సొంపుగఁగట్టిన యుత్తరీయముల్
కంగులుదీర సంసములు గ్రమ్మకవ్రేలఁగఁ జల్దిసాదముల్
ఠంగునఁగొట్టి కోవెలకొ తాయులఁ గొందఱుమందివైష్ణవుల్
పొంగళిబుట్ట లెత్తికొని పోవుదు రిండ్లకు వీధివెంబడిన్.

చ. తెలియదు నాకుఁ బూర్ణముగ ధీరులు వైష్ణవు లేమి సేతురో
చలనము గానరాదు, తెఱచాటునఁ జేతు; రదేమిటంటిమా
తళియ యటంద్రు; కొంచెము నిదానముగా నొకయింతవింటిమా
గళుకుగళుక్కు మన్గటుకు గట్కు-గుటుక్కు గుటుక్కు-గుట్కు-మన్.

శా. బారుంబూరుగ నారగింతురు పడప్పణ్ణేరముల్ పూర్ణ ప
ణ్ణేరంబు ల్పుళిహోర తైర్మవడ పణ్ణేరంబు దధ్యోదనం
బారంగర్యమధుల్కొ-ళంబు పురితొ హ్యాతై రుమోరున్మహో
దారస్వైరవిహారవైభవు లుదాత్తప్రాభవుల్ వైష్ణవుల్

ఉ. కాఁకరకాయ కట్టొకటి కైనిడిపోయెడికాపు జూచి "చీ
యేకడఁగజ్జికాయ లివి యేటికనన్ విని "మంచికూరయోఁ
గాఁకరకాయలం" దనుచుఁ గాపు వచింపఁగ "నట్ల నా, యవుం
గాకిటుఁ జూపు" మన్న విని కాపు సమర్పణ సేయఁగా దిరు
ప్పాకముఁజేసి సాపడిరి వైష్ణవు లొక్కరు తొల్లి మెల్లనన్.

ఉ. వైష్ణవునామముల్ గనిన బా బొకఁ డోర్వక నాక వానిక్రో
థోష్ణము నార్ప నాతఁడొక యుక్తిని బన్నెఁదురుష్క-భూమిరా
డ్జిష్ణుతకంచు నాభిపరిషిక్తము దిద్దుట గాన కాతఁ డా
యుష్ణకరాత్మజాలయము నొయ్యనఁబోయె నటంద్రుగ్రక్కునన్

చ. చెఱువునకేగెడున్ జలము చెంబును బూనఁడు, లేశమాత్రము
న్మఱుఁగు జరూరులేదు, తను మానవు లెవ్వరు చూచినన్ సరే
వెఱువఁడు, బాహ్యగామి యగు వేళను, సాపడునప్పు దొప్పుగ
న్దెఱమఱుఁగడ్డముంచకను తీరదు వైష్ణవభూసురాళికిన్.

చ. దిటముగ లోనగోచియిడి తెల్లనిథోవతి గూడకట్టుగాఁ
బటుగతిఁగట్టి జుట్టుముడి, బల్హొయలై వెనుపట్టెమూయఁగా
స్ఫుటముగ నూర్ధ్వపుండ్రములు శోభిల దవ్వుల నవ్వుకొంచుని
వ్వటముగఁ గన్నులార్చుచును వైష్ణవమాణవకుండువచ్చెడిన్.

ఉ. పూచినతంగెడుల్ కరిగి పోసినబొమ్మలు నిల్చి ధాత్రిపైఁ
దోచిన క్రొమ్మెఱుంగు లమితోజ్జ్వలరాజకిరీటకోటిపైఁ
దాచినపద్మరాగములు దర్ప కుదార లసత్పటంబుపై
వైచినచిత్రరేఖ లల వైష్ణవసుందరు లేమి చెప్పుదున్.

తరువోజ. తిన్ననిసన్నని తిరుచూర్ణ రేఖ
తీరుగా సౌరుగా దిద్దినమోము
మిన్నఁగా నున్నఁగా మెఱుఁగార దువ్వి
మేలుగా వీలుగా మెలచినకొప్పు
చిన్నారి పొన్నారి చెమరెత్తుచున్న
సిరుగుల్కు నెఱిదళ్కు చెక్కుటద్దములు
వన్నెతో చిన్నెతో వరుని మెప్పించు
వాసిగా దాసిగా వైష్ణవయువతి.

ఉ. సారణిమీటుఁ గిన్నెరల సాటిగ సన్నని గొంతు లెత్తి శృం
గారముమీఱ రాగములు గాసరిగాఁ బెరుమాళ్ళసన్నిధిన్
హారతు లిచ్చువేళల యొయారము వైష్ణవపమ్మవారలం
గారలదేసుమీ మధుర గానము తమ్మిళిపేశి దోడ్పడన్.

చ. కలదుసుమీ యొకింతయుపకార మనాథలపట్ల మేటితెం
గళి కుడివద్దలం దదియుఁ గానము స్మార్తులతోటిపాటి యెం
దులకిటులంటి రంచు మదిఁ దోఁచెడి మీకును శంక దీర్చెదన్
నెలనెలకున్ వితంతువుల నెత్తులు మంగలి ముట్టకుండుటన్.

చ. "ఎడపక సానియి ల్మటిగి యిల్లనఁ దద్దిర"యంచుఁ దండ్రియ
ప్పుడఁ తుకయింటఁ గన్మొరగి బాలకుఁ జూడఁ బిపాస దానిపా
వడ బయిక త్తి లోనిమిడి పాలునుగూడునుసాపడంగ "నా
బుడుతఁడు వైష్ణవంబు నిలు పున్సరిగా" నని మెచ్చి వానికై
వడుల గణింప కేగెనఁట వైష్ణవుఁ డొక్కఁడు తొల్లి వింటిరే.

## శైవులు

సీ. భస్మత్రిపుండ్రముల్ ఫాలదేశంబున
నడునెత్తిమెడమీఁదఁ గడతలందు
కనుఁగ్రేవలను వీఁపునను బుజంబులయందు
మోచేతులందు ఱొమ్మునను బొజ్జ
మణిబంధములఁ గటి మండలంబున వ్రేళ్ళఁ
బ్రక్కల మోకాళ్ళఁ బిక్కలందు
సీలమండలనుఁ బాదాలపై నడుగుల
వ్రేళ్ళ మొదళ్ళను గోళ్ళయందు

గీ. నిచ్చటచ్చటననరాక నెల్లయెడలఁ
దనువు నిండఁగఁ దెగఁబూసి తమ్ముఁ జూచి
యదరిపడి బ్రహ్మరాక్షసుల్ బెదఱిపాఱ
శైవభూసురు లాంధ్రదేశమునఁ గలరు.

సీ. తలయు గడ్డము మీసములు గోళ్ళుఁ జంకలు
దండిగాఁ బెంచి గొందఱు చరింత్రు
మణిగేఁడు రుద్రాక్షమాలికల్ మెడయందుఁ
దలయందుఁ దాల్చి కొందఱు చరింత్రు
పులి వెంబడించినప్పుడు గూడ భవిసీడ
దరియరా దనుచుఁ గొందఱు చరింత్రు
ఎట్టియాపదనైనఁ బట్టినట్టి వ్రతంబుఁ
దప్పరా దనుచుఁ గొందఱు చరింత్రు

గీ. బ్రాహ్మణులతోడి పొత్తును భక్తిమీఁది
వలపు నీరెండు నెన్నఁడు దలఁపునందు
మఱవఁగా రాదటంచుఁ గొందఱు చరింత్రు
శైవభూసురు లాంధ్రదేశంబునందు.

సీ. పంచాక్షరీమంత్ర పఠనగోప్యమె కాని
యధ్యయనంబు లంతంతమాత్ర
మాగ మోక్తంబుల నాచరించుటె కాని
వేదోక్త మదియొక్క వీసముండు
నట్టిల్లు నిండఁగాఁ బట్టు పెట్టుటెకాని
కర్మధర్మము లెవ్వి కానరావు
తుదకు నూతైన వత్తులు గాల్చుటేకాని
యౌపాసనములు మాటాడరాదు

గీ ధనము వెచ్చించి రాత్రిభోజనము లిడుచు
జనులు గొనియాడఁగా గణార్చనలెకాని
యజ్ఞయాగాదికముల పేరైన వినరు
శైవు లేమందు నాంధ్రదేశంబునందు.

చ. పరశివునం దమందదృఢభక్తి, యనారతనిందితక్రియా [శా
చరణమున న్విరక్తి, మధుసారము లొల్కు మృదూక్తి దేవ
ద్వరకరణాగమప్రచురతంత్రవిశంకటశక్తి, తుందగ
హ్వరపరిపూర్ణభుక్తి, యహహా యివి శైవుల నైజసంపదల్.

చ. మనుదినమున్ ప్రసాదనియమంబును నిత్యమహేశ్వరార్చనం
బును నిరతంబు బిల్వదళపూజ సదాధృతభవ్యలింగలాం
ఛనమును సర్వదా పటుపిశాచవితానవిపాటనక్రియా
చణమగు భూతిధారణము శైవులు మాన్యులుగారె ధారుణిన్.

ఉ. కట్టలుకట్టలే కరుచు గావలెఁ బత్తిరి, ముగ్గుపిండులా
బుట్టలె బుట్టలే తఱిగి పోవలె, మెత్తనిదూదివత్తులా
తుట్టెలుతుట్టెలే చమురుతో వెలుఁగన్వలె, నాప్రసాదమా
తట్టలు తట్టలే కొసలు దట్టగ విస్తరి నిండఁగావలెన్
పట్టులుపట్టులౌర యయవారలకు న్శివపూజవేళలన్.

సీ. నూఱువత్తులవారు పేరు చెందనివారు
వేయివత్తులవారు విడియుచోట
వేయివత్తులవారు వెనుకఁబట్టినవారు
లక్షవత్తులవారు డాయుచోట
లక్షవత్తులవారు లావుదూలినవారు
కోటివత్తులవారు గూడుచోట
కోటివత్తులవారు కొఱకుమాలినవారు
భూరివత్తులవారు చేరుచోట

గీ. విత్తమునకే ముదాత్తవిద్వత్త కేమి
చిత్తసత్తల కేమి ధీమత్త కేమి
వత్తులే బత్తులకును మహత్తు లెన్న
దేవసములైన శైవభూదేవులందు.

ఉ. కాయము భూతిభూషితము కర్మము తీక్ష్ణము దుర్గమంబు న
త్యాయతి నంతరంగగుణ మద్భుతమైనశిలన్ గరుంగఁగాఁ
జేయుజగత్తమంబు పసఁజించు మహామహిమంబు భానులె
క్కాయను గంటిరే నివురు గప్పిననిప్పులు శైవభూసురుల్.

మ. తమకున్ వృద్ధవితంతుమండలము వేదాంతార్థసారోపదే
శములన్ శిష్యగణంబులై కొలువఁగా, సత్తంచుఁజిత్తంచుభూ
తములంచున్మఱియింద్రియమ్ములనుచున్ దత్తంచుఁద్వమ్మంచసి
క్రమమంచుంబరమాత్మయంచుగురురా ట్కారుణ్యమంచుందవై
వమమంచుం బహుధా వచింతురవహావ్వా? వృద్ధశైవాగ్రణుల్.

ఉ. తత్త్వవిదుల్ శివద్విజులు దారు వచింతురు వారి కెప్డు ప్రే
తత్త్వము లేదుగాన తనుదాహము గూడదటంచు; బాగుదే
వత్వమునందు వారలకు వచ్చునధోగతు లాసమాధివా
సత్వమునన్ గతం బెఱుఁగఁ జాలవిరుద్ధముగాఁ గనంబడున్.

ఉ. తల్లికి భారమా? శిశువు, తామరతూటికి పువ్వు భారమా?
విల్లొకభారమా? కడిఁదివీరున, కొంబెకు గూను భారమా?
వల్లికి భారమా? ఫలము, బఱ్రెకుఁ గొమ్ములు భారమా, నుతుల్
చెల్లును లింగధారులకు లింగఁపుగాయలు భారమా? మహిన్.

శా. భూతప్రేతపిశాచ రాక్షసగణంబుల్ శాకినీఢాకినీ [హ యం
వ్రాతంబు ల్భయకంపమంది తొలఁగన్ హ్రాంహ్రీంపటోస్వా
చాతంకంబులుమానిమంత్రమహిమవ్యాప్తిన్ గ్రహగ్రస్తలం
ప్రీతిన్ దండనలాడఁజేతురు గ్రహావేశంబులన్ శాంకరుల్.

ఉ. లింగము వోయినం బ్రతుకు లేదని శైవులు లింగరక్షణన్
భంగములేక సేయుదురు; ప్రాగ్భవసంచితపాపశక్తిమై
లింగముపోయినం దెలియ లేరది మానవులంచుఁ గొందఱా
లింగముపోయినం బదులు లింగము దాల్తురు భక్తిమీఱఁగన్.

ఉ. మర్త్యత లింగధారణము మాత్రనపోవు నమర్త్యభావమే
కీర్త్యము శైవవిప్రతతికిన్, బ్రతు కందఱితోడిపాటె, యా
మర్త్యతకేమియర్థమొయమర్త్యతకేమొయెఱుంగమాదటన్
మర్త్యత మంటపాలగు నమర్త్యతగంటిరె మంటిపాలగున్.

చ. వడివడిగా హరీ యనిన వారక మూతురు గర్ణరంధ్రముల్
తొడరి హరా యటన్నఁదమితోఁదమమేనులు దామెఱుంగ రా
గుడితలకట్టు భేదమునకున్ రసభేదము నొందునట్టి దె
క్కడిపని శైవభూసురశిఖామణులందునఁదక్క లాఁతులన్.

ఉ. కొందఱి భూతకోటిఁబురి కొల్పుదునం చదలించి లోఁగొనుం
గొందఱియింట నౌకరయి కొల్చి మతు ల్కరఁగించి యిష్టుఁడౌ
నందిన జుట్టుఁ బట్టుకొను నందకయుండినఁ గాళ్ళువట్టు న
స్పందవిచారశీలుఁడగు శైవమహీసురశేఖరుం డిలన్.

చ. అడవి నెడారిదారిఁ జనునప్పుడు శైవమహానుభావుఁ డో
రుఁడొకఁడు వెంబడించినఁ బరుంగిడఁ గాలికొలందిఁ జొచ్చియా
మిడిమిడి దొంగపోటులకు మిక్కిలియయ్యెను లింగపోటటం
చడుగిడనేల కీశ్వరహరాశివశంకరయంచుఁ గూయిడెన్.

శా. అయ్యా శైవులఁ బిల్చుచో జనులు పేరయ్యయ్యవారంద్రుపే
రయ్యంద్రొక్కరుపేరయంద్రొరులు పేరారాధ్యుఁడంద్రొక్కరా
యయ్యన్ బేరయ లింగమంద్రొకళు లొయ్యం బేరలింగంబటం
ద్రయ్యైవేళల వారువారు సమయోక్తానేకనామంబులన్.

ఉ. చర్యలు నామము ల్దెలుపు శైవులు వైష్ణవు లంచు నెప్పుడున్
ధార్యము లింగ మొక్కరికిఁ దప్తము లన్యుల; కెన్నలింగయా
చార్యుడు రంగలింగమును శైవులు వైష్ణవులందు నామసాం
కర్యమునొందుఁ బూరుషులు గానఁగరారు మతంబుకట్టడిన్.

చ. మొగమున భూతి రేఖలవి మూడుఁగణంతల రెండు దీర్చివా
సిగఁబలుజందెపోగులను జేర్చిన నున్నవి లక్కలింగకా
యగనఁబడుంగనంబడ దొయారముగం జరలింగ మందు రీ
జగమున లింగధారిమత శాబకుఁ డాడు నియోగిబాలుతోన్.

సీ. సూత్రంబునకు లింగసూత్రంబు సహకారి
పోసఁగుఁ గుంకుమకు విభూతి తోడు
కరకంకణముల సంగాతముల్ దోరముల్
ధూపగంధము గంధలేపసఖము
అవతంసభూషా సహాయంబు తొగతేకు
రహిఁ బదంబులకుఁ బారాణి నేస్తి
కొనచెవి బొగడల కనుఁగు మారెడుపత్రి
గోళ్ళకుఁ గాదిలి గోరిఁటాకు

గీ భక్తిమహిమకు నఱచూవు ప్రాపుసుమ్మ
శాంతభావంబు మందహాసంబు ప్రియము
ఉక్తిమృదుతకు శివనామ ముపపదంబు
వాసిగను లింగధారమ్మవారలకును.

సీ. వేఁగుజామున లేచి వీధిగుమ్మముఁ జిమ్మి
యిల్లూడ్చి యావెన్కఁ బళ్ళు దోమి
గోమయంబునుఁ దెచ్చి గీము నున్నఁగ నల్కి
కలయంపి వాకిళ్ళఁ గలయఁజల్లి
చిన్నెవన్నెల ముగ్గు చిగురుదారలఁ దీర్చి
మడిబట్ట లుతికి ప్రొయ్యి పిడకల నిడి
రాఁజేసి మడిగట్టి రాజాన్నములు వండి
భక్తిమీఱఁగ బిండి పట్టుఁ బెట్టి

గీ. వత్తిజోతులు మారేడు పత్తిరియును
తుమ్మిపూవులు చమురు కుందులు విభూతి
పండ్లు పతిశివపూజ కేర్పాటుఁ జేసి
వాసిగను లింగధారయ్య వారి నారి.

సీ. తుట్టెగట్టినపిండి తట్టలో దొకయింత
ముగ్గుపట్టులఁ బెట్టు ముగుదయొర్తు
బూజువట్టిన ప్రాఁత బూదిగడ్డలు కొన్ని
లింగలేపము సేయు లేమయొర్తు
వలుగుగా నెండి ప్రాఁ బడిన మారెడుపత్రి
శివపూజ కొనఁగూర్చు చేడెయొర్తు
ఏడాది కొక్కతూరే చేసి డాఁచిన
వత్తులు వెలిఁగించు వనితయొర్తు

గీ. ఉడికియుడకనిమెదుకు నీళ్లోడుపప్పు
కాఁగికాఁగనిచారును గరిటెనంటి
తొలఁగిజాఱని కట్టావి పులుసుఁగూర
పతికి వడ్డించు శైవరూపవతియోర్తు.

చ. వలపులు లెస్స, కూడని వివాదలు లేశము గానరావు, కా
వలసినయంత భక్తిగల వారయినన్ భయమే కొఱంత భ
ర్తలయెడ లింగధారివనితాతతి, కయ్యది వారిపుణ్యమో,
చెలువలదోషమో, తలఁప స్వీకృతలింగ శిలామహత్త్వమో,

శా. చారుంగూరలుపప్పులుంబులుసు పచ్చళ్ళప్పడాల్ దప్పళా
లూరుంగాయలు మెంతిమజ్జిగలు పాలుంబాయసాన్నంబులుం
గారెల్బూరెలుబొబ్బటుల్ దినఁగ పక్కా-బంట్లు శైవుల్ స్వచే
ష్టారూఢంబగు కాఁకకుం బసవగడ్డల్ దొడ్డమందుండఁగన్.

చ. కుడువఁడు భక్ష్యభోజ్యములు గోరసనీరముఖద్రవంబు లా
నడు మెడబంగరుంగొలుసునం దగిలించిన లింగకాయలో
విడిసినలింగమూర్తికి నివేదన సేయక శైవభూసురుం
డడవి నొకండు నెందను బ్రయాణము సేసెడివేళనేనియున్.

చ. పశువుమతంబుశైవమది, పాముమతం బది వైష్ణవంబు, క
ర్కశములు గావు మాధ్వ మది గట్టిగఁగోతిమతం; బదెట్లునాన్
బసవఁడు,భాష్యకారులును, మధ్వుఁడు;నందియు,శేషుఁ డంజనీ
శిశువును మానవత్వమును జెంది జనించినవారు కావునన్.

## కరణకమ్మలు

మ మతమేదో తెలియంగరాదు కలదామాధ్వాళితోఁ బొత్తు, సం
తతమున్ లౌకికవృత్తిజీవనము, పెద్దల్ వామనాచార్యనం
చితసిద్ధాంతము వారి దందురు; మఱాసిద్ధాంత మే చందమో,
మతి నూహింపఁగ లేరుపో? కరణకమ్మల్ తెల్గుదేశంబునన్.

సీ. నూఱూళ్ళ కొకయింటి వారైనఁ గనరారు
దొరకిరా యరుదుగాఁ బురములందు
నమరదు పడుచు పెండ్లాడఁదలంచిన
దొరకెనా యొకసంచి దులపవలయు
వెతకియైనను వారి మతముఁ జెప్పఁగలేము
దొరకెనా సిద్ధాంత మెఱుకపడదు
పరమవైదికమును బట్టిచూచినలేదు
దొరకెనా ముదుసలి త్రొక్కులందు

గీ. అన్నదమ్ములవారలు గన్నవారి
నడుమ వచ్చినవెనుక నొక్కెడనె యుంట
దొరకెనా యొక్కరిద్ద ఱుందురు జగాన
విలువగలవారు కరణకమ్మ లనువారు.

చ. నడవడులన్ని యోగిసరి, నామమునందును లౌక్యమాధ్వకై
వడి, మడిమంత్రలందుఁదుల వైదికుతో, నిఁక వైష్ణవంబుచొ
ప్పడుసముదాత్తభాగవత భక్తిని, యుక్తి గొఱంతలేదు నల్
గడలఁ బొసంగెడిన్ గరణకమ్మకుఁ గుమ్మకులిమ్మతమ్ములన్.

సీ. గుణము మంచిది కాని గుట్టు కొంచెంబైన
కరణకమ్మలకు జగానఁ గాన
త్యాగభోగమెకాని ధనసంగ్రహము చాలఁ
గరణకమ్మలకు జగానఁ గాన
మాటబింకమెకాని మనసు నొప్పించుట
కరణకమ్మలకు జగానఁ గాన
పేరుదొడ్డదిగాని బెట్టు విస్తారంబు
కరణకమ్మలకు జగానఁ గాన

గీ. లౌకికములైన వ్యవహార లాంఛనముల
వేషభాషల క్షాత్రంబు వెలయుఁగాని
బ్రాహ్మణాచారహాని యే పట్టులందుఁ
గరణకమ్మలలోన జగానఁ గాన.

సీ. కొమరైన జలతారు కోకగట్టునుగాని
గోచిగొప్పది పైఁటకొంగు కురుచ
రాణించు మేల్పట్టు రవిక దొడగుఁగాని
జేబుపెద్దది దండచేయి పొట్టి
ముంజేతికంకణంబులు పసందే కాని
కడ్డీలు లావు లో దొడ్డి బిగువు
నాణెంపుబంగారు నత్తుఁ బెట్టును గాని
గాటు పల్లము రాతికట్టు మెఱక

గీ. స్మార్తులందు నియోగుల మాధ్వులందు
యాజ్ఞవల్క్యులయందు లౌక్యప్రవరులఁ
గరణకమ్మల నీనాఁటికాలమందు
వఱలు వగలాఁడిపడుచు పువ్వారుఁబోఁడి.

## యాజ్ఞవల్క్యులు

మ. కుడువంజొచ్చును బ్రాహ్మణార్థములఁ బెక్కుల్ రాజకీయార్థముల్
నడువంజొచ్చును యాజ్ఞవల్క్యుఁడు ధరన్ నానోచ్చనీచంబులం
దెడ లేక న్నటియించుఁ గాలము కొలం దింబోవు, నేయెండ కా
గొడుగుంబట్టు ధనార్జనంబునకు నె గ్గున్ మ్రొగ్గు తగ్గేమనున్.

## గోలకొండ వ్యాపారులు

ఉ. పేరున రావుపంతు లని పెట్టకమానరు, వైష్ణవంబు వి
స్తారము, వైదికంబు గలదా? యని రోసినఁ, గొంతజిక్కు సం
సారముగుట్టువారలదె, 'సాధువు లెందును గోలకొండ వ్యా
పారులు లౌక్యవృత్తులన' పారులు, కారులు పల్కు రెప్పుడున్.

సీ. కుచిదేటినయొడళ్ళు సొగసైన కుచ్చెళ్ళు
చిట్టాడుమీగాళ్ల జుట్టుముళ్ళు
తమ్మెట్ల రవఱాళ్ళు తమలంపుఁ బసనోళ్ళు
రంగురుమాళ్ళుం గరాల వ్రేళ్ళు
రావుపంతులు పేళ్ళు రవరవచప్పుళ్ళు
రాతిరియుఁ బగళ్ళు వ్రాయుగీళ్ళు
బంగారుమొలత్రాళ్ళు పైజారుజోళ్ళు వై
ష్ణవు చేతిసీళ్ళు అచాటుమళ్లు

గీ. చక్రపొంగళ్ళు సాపాట్లు సగముపాళ్ళు
పెళ్ళినడవళ్ళు వేయాలు పెట్టుబళ్ళు
నిత్యమును గామ్యములు సొమ్ము నిజము గోల
కొండ వ్యాపారులం దాంధ్రమండలమున.

సీ. ఎలమిఁ జీపురువట్టి యిల్లూడ్చునపుడైన
పోసీరు తలజుట్టు పూలమెఱుఁగు
అసదుగా జలకంబు లాడు వేళలనైన
పోసీరు నునుగొప్పు నూనెమెఱుఁగు
మడిగట్టి వంటకా ల్కడతేర్చునపుడైన
పోసీరు తొడగుకడానిమెఱుఁగు
నాయకాలింగనోన్నతసౌఖ్యమందైన
పోసీరు కొంతైన మేనిమెఱుఁగు

గీ. తనులతా చారుతాళుచితావిభూష
ణాంచితాంగవిలాసతావార్తినతుల
మతుల సుకృతులఁ గృతచమత్కృతుల గోల
కొండవ్యాపారసతులఁ బేర్కొనఁగఁ జనదె.

## ద్రావిడులు

ఉ. ద్రావిడవైదికోత్తముల ధర్మములన్నియు దేశ్యతుల్యముల్
గా వొకకొన్ని భేదములు గానఁగవచ్చు శివాక్షమాలికల్
లావు, సదా వహింత్రు నవలాల్ కుడిపైఁటలు, కచ్చకట్టులా
లేవు, వివాహకృత్యములు లెస్సలు, సాములు దేశయాత్రలం
ద్రోవిడుసొమ్ము లంగనల పూర్వభవార్జితపుణ్యలబ్ధముల్.

## వివాహములు

ఉ. చెప్పకయున్న దోషమగుఁ జెప్పినగోపములేమిసేయుదున్
జెప్పకతప్ప దీ వయిపు సీమల బ్రాహ్మణకోటిఁ గన్యకల్
గొప్పగిరాకి పెద్దపడి గుండున నల్వదిసేర వెండికిన్
జప్పుడు లేక దూఁగు నది చాలకయున్న మఱొక్క సేరగున్.

ఉ. చెప్పినకార్యమే మెవరు చేతురు నాపలు కాలకించి, వెం
కప్పకు డెబ్బ దేండ్లు నరసమ్మకు నెన్మిది యేడు లీడుగాఁ
జొప్పడెనంచు నాంధ్రపదసూరులుతప్పక పొంతనంబులన్
జెప్పుదు రెంతతప్పుపని చీః ముసలిం బసికాయ మెచ్చునే?

ఉ. అప్పుడె పెండ్లి వచ్చె మన యమ్మికినంచును దల్లిదండ్రియ
న్నప్పలుఁ జెప్పఁగా వినుచు నాయికఁ దోయిలమబ్బెఁ జక్కిలాల్
పప్పులు పాయసా లరిసె పప్పులుకుప్పలు తెప్ప లప్పరో
యెప్పుడెచెప్పుచెప్పుమని యీ త్తురుపయ్యెదకొంగుఁ బట్టికిల్
గొప్పనకొప్పులై కురులు గూడనియీడున నాంధ్రబాలికల్.

ఉ. చేతురు కయ్యము ల్గడుసుచెయ్యుల వియ్యపురాండ్రు; చాలునీ
కూఁతురిసారెలో నిడిన కోక యిదోపది రెండుమూళ్ళు; నీ
కూతుఁరిసారె నేను గనుఁ గొంటినిగా పదిమూళ్లె లేదుగా
నీతులు లాఁతికిం దెలుప నేర్తు వటంచును మూతిద్రిప్పుచున్.

## అత్తకోడండ్రు

చ. తెలిపెడి నత్త, కోడలికి దివ్వెలదివ్వెలదివ్వెలంటుదుఁ
దల; శనివారమాపయినిఁ దా బుధవారమునాఁడు నంటుదుఁ
దలవినుఁడమ్మకూఁతులకు; తథ్యముచెప్పుఁడుతల్లులార! యం
చలవడినీళ్ళరేవుకడ నమ్మలు నక్కలు గూడియుండఁగన్.

చ. అడిగినఁబొట్టనిండునటు లన్నమువెట్టనియత్తతోఁడఁ దా
వడివడి నంబటేరదుగొ వచ్చెడి! నత్త, యనంగఁ గోడలా!
బుడబుడ లేల పొమ్ము కొలబుఱ్ఱను జూడుము నాదు చేతిలోఁ
దడఁబడదెప్పుడంచు నుడి దప్పక కోడలి కత్త సెప్పెడిన్.

చ. అలుకున బిచ్చగానిఁగని యందదు పొమ్మని కోడలన్న, వాఁ
డలుఁగుచుఁ బోవఁద్రోవఁగని యత్తిటు రమ్మనిపిల్వ, వాఁడురా
నిలువకపొమ్ము లేదనిన నీ కిదియేమని వాఁడనన్; సరే
కలదన లేదనన్ దనది కావలెఁ గోడలిత్రేష్యమేమనున్.

ఉ. "కోడల! వీఁపుదోము"మని కోరినయత్తనుజూచి"యత్త! చే
యాడదు, కాలుపై కెగయు" నన్న "నయో, మును నేను మీఁది
తోలూడఁగఁగాళ్ళతో నదిమి హుమ్మనితోమితి నత్తవీపు, నే
డీడకువచ్చె దానిఫలమే కుడుపుంగద కోడలా" యనున్.

చ. చనువునఁ గోతినెత్తినొక చక్కనితాయిడి యత్తవారికుం
దన వినిప్రక్కలై ధరఁబడన్ విడుఁ; బుట్టినయింటివారికుం
దన విని మెల్ల మెల్లన నపాయము సేయక డించు నట్లుగా
గొనకొను నత్తగారికిని గోడలికిం గల యానుకూల్యముల్.

## పండుగలు

### సంక్రాంతి

చ. నిరుపమలీల బాలికలు నిశ్చలభక్తిని యుక్తిసంకురా
తిరినెలఁ బేడగొబ్బిలులు దీర్తురు వాకిళులందు ముగ్గులన్
బొరిబొరి బొమ్మలన్నిలిపి పూజలు సేతురు బొమ్మరిండ్లలో
బరువడి నారఁగించెదరు పచ్చడిబెల్లము పుల్గ మిచ్చలన్.

### అట్లతద్దె

చ. బడిబడి నట్లతద్దెయను పండుగ వచ్చిన సంతసిల్లుచున్
వడిఁ దెలవాఱుచుక్క బొడువం గని లేచి సమస్తబాలికల్
మడినిడి పొట్లకాయపరమాన్నము నన్నము మెక్కి యాటలన్
బడిమఱునాఁట నుయ్యేలలపైఁ దగనూఁగుట జూడనొప్పదే

### దీపావళి

చ. చిటపట టుప్పుటప్పనెడి సీమ టపాకుల పెట్టెలెన్ని యు
ద్భటముగ ధమ్మధుమ్మనుటపాకులవెన్ని, మతాబులెన్ని, పి
క్కటిలెడి ఝిల్లులెన్ని, మఱి కాకరపూవతులెన్ని గాల్తురో
దిటముగఁ దెల్ప నాతరమె దివ్వెలపండుగ రేయి నర్భకుల్.

### వినాయకచవితి

చ. తొలుదినమే వినాయక చతుర్థికి ముందర రాల్ పలేరుగా
యలు గడియించి పండుగ మహాగణనాధుని మంచిమంచిపూ
వులఁ బలుపత్రులం గఱికిఁ బూజలు చేసుక ప్రొద్దుగ్రుంకఁగా
నల పొరుగిండ్లఁ జల్లుకొను చాడికఁ జెందుదు రర్భకావళుల్

## సంవత్సరాది

సీ. అలవణ నింబపుష్పామ్లరసాలళ
లాటుఖండములు తో ల్తఁ గబళించి
ఇష్టమృష్టాన్నముల్ తుష్టిగా భుజియించి
విప్రోత్తముఁడు గ్రామవీధిఁ జేరి
పదిమందిరయితుల గుదిగూర్చి కూర్చుండి
క్రొత్తపంచాంగంబు నెత్తి చదివి
ఆదాయములును వ్యయంబులు నెప్పి కం
దాయంబులకు వేళ యాయె ననిన

గీ. దుడ్డు నిండుగ నిచ్చిన దొడ్డవారి
కన్నికందాయములు పూర్ణ మనుచు జెప్పు
దుడ్డు దుగ్గాని లేదన్న గొడ్డుఁబోతు
కన్నికందాయముల శూన్య మనుచుఁ జెప్పు
నౌర బాపన సంవత్సరాదినాఁడు.

## నానావిధేతర విషయములు

### పొడుము

సీ. పాటిపొగాకు బైపయి మడ్డిగల బారు
దళసరికొమ్మముక్కలు గ్రహించి
నడిమీనె దివిచి చొప్పడఁ గణకణలాడు
మేలైననిప్పులమీఁదఁ గాచి
మంటికోసను నల్పి మంచికల్లును నూఱి
తడియొత్తి సున్న మింత తగవైచి
నేర్పుతోఁ గమ్మని నేయి కొంచెము పోసి
పొలుపైనవన్నె రాఁ బొడుముఁ జేసి

గీ. వెండిపొన్మూతఁ గొలుసు బొబ్బిలి పసందు
సోగమారెడు బుఱ్ఱఁ బోసుకొని రొండి
నిడి తలఁచినప్డు కించిత్తు పొడి గ్రహించి
బుఱ్ఱుమనఁ బీల్చు బాపని ముక్కు ముక్కు

## ఇతర విషయములు

చ. నలుగురుపట్టుపట్టుమన నాపలు కెవ్వరు విండ్రు, గట్టిగాఁ
దెలిపినఁగోపగింతురును ధీతిలకంబులు, దాని కేమిలే
యఱుకనువిప్రజీవనము యాచ్ఞయటండ్రు గృషింద్యజింతురిం
తలుగలవా? యటంచు సరి నాఁడులవారలు నవ్వునట్లుగన్.

శా. స్మార్తుల్ దూఱిరి మాధ్వభూసురుని గర్మభ్రష్టుఁ డంచు న్వెసన్
స్మార్తున్ మాధ్వులు దూఱి రోడకను ముమ్మాఱు వ్రతభ్రష్టుగా
భర్తీ వైష్ణవవిప్రునందు నుభయ భ్రష్టత్వమం ద్రిద్దఱున్
ధూర్తత్వంబున విష్ణువాసరమునం దుం దద్దినం బబ్బినన్.

ఉ. తిండికి బత్తెమిండు నెల దీరిన దింకొకయిద్దు మప్పుగా
నిం డది తీరులోన జమ యిత్తు నటంచును గంప దుల్పఁగాఁ
బండినపంటలోన సగబాలు హరించును పాలివాఁడు బా
పం దొనరించు సేద్యమున బా గొకజుట్టు నతండు నిల్చుటే.

చ. మలుమలులంచు వచ్చినవి మంచివి గావవి, యేమొకాని యా
ఱ్నెలలకుఁ జిగ్గు చీయొడలు నిండిన దట్టపు తాటిపాకచా
వులు మనువాకపుష్కరము పూచిమడంతను గట్టి చాకికిన్
నెల కొకసారిగా నుదుక నిండని యందురు వృద్ధభూసురుల్.

ఉ. తిండ్లరబాలుమజ్జిగలు తేటతుషారపునీళ్ళు పప్పులే
దిండ్లొకచెంపఁగప్పిగసి యెండయువానయుఁదూలిపోదు, రెం
డేండ్లకు నైదుసారు లుతికించినబట్టలు, నేమి సెప్పుదున్
బెండ్లముమీఁదనింటిపయిఁ బెత్తనముంచినవానిసౌఖ్యముల్.

## తెలుఁగునాడు

బ్రాహ్మణ ప్రశంస సంపూర్ణము

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| III | 8 | నమీ | నవమీ |
| IV | 6 | నాదుఁ | నిందుఁ |
| VII | 14 | లక్ష్మణా | లక్షణా |
| VII | 19 | నౌక యొత్తు | నౌకయొత్తు |
| IX | 4 | నిర్వహాక | నిర్వాహక |
| X | 13 | ప్రపంచమునకు సమాన మగు | ప్రపంచమున కసమానమగు |
| XI | 8 | విజయవాడలో | రాజమహేంద్ర వరములో |
| XIII | 8 | తెనుగునాడు | తెలుఁగునాడు |
| XIII | 10 | తెనుగునాడే | తెలుఁగునాడే |
| XIII | 11 | వృత | వృత్త |
| XIII | 19 | ప్రదీపిక | దీపిక |
| XVI | 12 | విద్యాలయలలో | విద్యాలయములలో |
| XVIII | 12 | తాతలనాఁడి సేలువులు | తాతలనాఁటి సాలువులు |
| XVIII | 15 | నిలిపిన | విడిచిన |
| XXI | 6 | స్థాలిత్యములు | స్ఖాలిత్యములు |
| XXII | 25 | later | latter |
| XXIII | 8 | Polised | Polished |
| 2 | 4 | తెలుఁగులు | తెలఁగులు |

| | | | |
|---|---|---|---|
| 5 | 6 | సుతులు | స్తుతులు |
| 8 | 13 | స్తుతిప | స్తుతింప |
| 9 | 17 | బ్రిదికి | బిదికి |
| 10 | 15 | మేవ్ | మ్రేవ్ |
| 11 | 17 | మ్రెయఁగ | మోయగ |
| 15 | 17 | కొందుడు | కొందురు |
| 16 | 3 | నంగయు | వంగయు |
| 17 | 2 | నానయుద | నానయిదు |
| 22 | 7 | చాలు | చాల |
| 22 | 10 | స్నానవు | స్నానవు |
| 23 | 15 | నందేఁడు | సందేఁడు |
| 24 | 5 | ప్రనన్నతా | ప్రసన్నతా |
| 24 | 6 | నామఖో | నాముఖో |
| 25 | 12 | తిరుప్పావు | తిరుప్పావు |
| 29 | 2 | సంసములు | నంసములు |
| 29 | 9 | వడ | వడ |
| 29 | 10 | త్రైర్మ | త్రైరు |
| 33 | 2 | న్విర్వ్యక్తి | న్విరక్తి |
| 35 | 20 | మహిసుర | మహీసుర |
| 36 | 14 | మున్నవి | మున్నని |
| 47 | 19 | మనువాక | మనునౌక |

